# సోషలిజం:

## ఊహాజనితమా?
## శాస్త్రీయమా?

12.2.49

రచన:
ఫెడ్‌రిక్ ఏంజల్స్

అనువాదం:
దుర్గారావ్

త్రిలిఙ్గ పబ్లిషింగ్ కంపెనీ
విజయవాడ

ఫ్రెడరిక్ ఎంగెల్సు.

# ఊహాజనిత సోషలిజం: శాస్త్రీయ సోషలిజం

## మొదటి ముద్రణకు తొలిపలుకు

"డూరింగు సిద్ధాంత ఖండనము" * అనే నా గ్రంథంలో చివరి మూడు అధ్యాయాలను కలిపి ఈ ప్రస్తుత గ్రంథంగా ప్రకటించటమైనది. దీనిని ఫ్రెంచిభాషలోనికి తర్జుమా చేయమని పాల్‌లఫార్గేకు యిచ్చాను. ఫ్రెంచి భాషలో ఇది 1880 లో ప్రకటింపబడింది. ఫ్రెంచి భాషలో నుండి పోలిషుభాషలోకి తర్జుమాచేయబడి 1882 లో మరల ఇది ప్రకటింపబడింది.

ఫ్రెంచి భాషలోనికి తర్జుమా గావింపబడిన పిమ్మట ఈ గ్రంథానికి ఫ్రాంసు మరితర దేశాలలోనూ వచ్చిన వ్యాప్తిని జూచి, జర్మను భాషలోకూడా ప్రకటిస్తే బాగుంటుందా యని ఆలోచించాను. ఈలోగా "సోషల్ డెమో

---

* "డూరింగు సిద్ధాంత ఖండనం" అనే ఎంగెల్సు గ్రంథం మార్క్సు "కాపిటల్" వలెనే మార్క్సిస్టు సిద్ధాంతగ్రంథాలలో అత్యప్రధానమైనటిది. ఈ "డూరింగు సిద్ధాంత ఖండనం" లోని ఉపోద్ఘాతంనుండి ఒక అధ్యాయాన్ని 3 వ భాగం ('సోషలిజం' అన్న భాగం) నుండి 2 అధ్యాయాలను కలిపి "ఊహాజనితసోషలిజం: శాస్త్రీయసోషలిజం" అనే ప్రస్తుత గ్రంథంగా ప్రకటింపబడినది. (అనువాదకుడు)

క్రెటు" పత్రికాసంపాదకుడు (ఈ పత్రిక జ్యూరిచ్ నుండి ప్రకటింపబడేది), ప్రచారమునకై కరపత్రాలు కావలసివున్న వనీ, వాటిని వ్రాయు బాధ్యతను నన్ను స్వీకరించమనీ కోరాడు. "డూరింగు సిద్ధాంత ఖండనం" లోని 3 అధ్యాయాలను ఇందుల కుపయోగించరాదా యని సూచించాడు. నేను దీని కంగీకరించాను.

అయినప్పటికీ, ఈ మూడు అధ్యాయాలూ వెను వెంటనే ప్రచారసాధనంగా వినియోగపడవు. పూర్తిగా శాస్త్రీయగ్రంథమైనట్టిది ప్రచారమునకు ఎట్లా వినియోగ పడుతుంది? ప్రచారానికి వినియోగపర్చాలంటే రూపం లోనూ విషయంలోనూ మార్పు తేనవసరం లేదా?

పుస్తకం యొక్క రూపం సంబంధించినంతవరకూ, విజాతీపదముల వాడకమే చిక్కులు తెస్తాయి. కాని, లాసెల్లీ కూడా తన వుపన్యాసాలలోనూ, ప్రచార కరపత్రాలలోనూ అనేక అన్యభాషాపదాలను వుపయోగిస్తున్నాడు. అయినా, నాకు తెలిసినంతవరకూ, అందువల్ల వచ్చిన చిక్కు ఏమీ లేదు. పైగా, ఈ మధ్యకాలంలో మన కార్మికులు పత్రికలను వరుసగా చదవటం ఎక్కువైనది. ఇందుమూలకంగా అన్య భాషాపదములను నేర్చుకొన్నారు. ఇంతేగాక, నేనుకూడా అనవసరమైన అన్యభాషాపదములను తొలగించాను. తప్పని సరియైన పదాలనే వుంచాను. సైన్సుకు సంబంధించిన సాంకేతికపదాలే అవి. వాటిని తర్జుమాచేయ వీలుంటే చేసే వుందును. కాని 'పిల్లి' అంటే 'మార్జాలం' అన్న రీతిగా తర్జుమా చేయదలచుకో లేదు. వీలుకానప్పుడు కూడా

తర్జుమా చేస్తే, అసలు భావమే తలక్రిందులౌతుంది. విష యాన్ని వివరిస్తానికి బదులు కంగారు తెచ్చి పెట్టుతుంది.

ఇక, గ్రంధవస్తువునుగూర్చి రెండవ విషయం. జర్మను కార్మికులకు సులభంగా అర్ధమయ్యేదే ఈవస్తువు. సామా న్యంగా, మూడవఅధ్యాయం శాస్త్రకష్టంగా వుంటుంది కాని కార్మికులకు కష్టంగావుంటుంది అని అనుకోను. బూర్జువా వర్గానికైతే అది గ్రాహ్యం కాదనుకోవచ్చునుగాని, తమ నిత్య జీవితాన్ని గూర్చినవస్తువే అయినప్పుడు కార్మికులకు అర్ధంగాక పోవట మనేది వుండదు. ఈపుస్తకంలో జేర్చిన టీకాతాత్పర్య ములను ఎక్కువగా కార్మికులకొరకైగాక పండితబ్రువులకొరకై వ్రాసాను. తరచూ తెల్లకాగితాలను చెడగొడుతూ, తమ అజ్ఞా నాన్ని ప్రదర్శిస్తూవుండే ప్రబుద్ధులు, సోషలిజాన్నిగూర్చి పిచ్చిపిచ్చి వూహాలన్నిటినీ బుర్రలో పెట్టుకొన్నపెద్దలు, వాన్ ఐనెర్న (శాసనసభాసభ్యుడు,) హెన్రిక్ వాన్ సైబెల్, టిట్స్కీ* మున్నగువారలనే దృష్టిలోపెట్టుకొని వ్రాశాను.

డాన్ క్విక్సాట్ పిండిమరలపైకి కత్తి దూసి లంఘించి వుండుగాక; అది ఆతని నైజగుణం; ధర్మం. కాని సాంకో పాంజాకూడా అట్లే జేసినట్లు మనం చూపించటం అసాధ్యం. ♦

---

*వీరందరూ జర్మనీలోని బూర్జువా చరిత్రకారులు. (అనువాదకుడు)

♦ సెర్వాంటిస్ అను ప్రఖ్యాత స్పానిష్ రచయిత "డాన్క్విక్సాట్ సాహసములు" అను వ్యంగ్యకావ్యమును వ్రాసినాడు. ఆకాలంలో ఫ్యూడల్ సమాజంలోని దుర్నీతిని, జమీందార్ప్రభువుల డాబు దర్పాలను, అజ్ఞానాన్ని అవినీతిని డాన్క్విక్సాట్ అను పాత్రద్వారా చూపించాడు. సాంకోపాంజా అను పాత్ర డాన్క్విక్సాట్ యొక్క భృత్యుడు; లోకజ్ఞానంగల రైతుబిడ్డ. (అనువాదకుడు)

సోషలిజం అభివృద్ధినిగూర్చి నేను వ్రాసిన ఘట్టంలో విశ్వసృష్టినిగూర్చి కాంటు, లాప్లాసు పండితులుచేసిన సిద్ధాంతాల్నిగూర్చి, ఆధునిక ప్రకృతి శాస్త్రములగూర్చి, డార్విను సిద్ధాంతాలగూర్చి, జర్మను తత్వవేత్తల సిద్ధాంతాలగూర్చి, హెగెల్ సిద్ధాంతాలగూర్చి నావిమర్శననుజూచి పైప్రబుద్ధుల వంటివారు విభ్రాంతి పడవచ్చును. కాని సోషలిజానికీ వీటికీ సంబంధం స్పష్టమే. నిజానికి, శాస్త్రీయ సోషలిజం జర్మను దేశభవమే. గతితార్కికవిధానాన్ని అనుసరించిన శ్రేష్టమైన తత్వశాస్త్రం ఏ దేశాలలో సజీవంగా వున్నదో అట్టి జర్మనీ దేశంలోనే** ఇట్టి శాస్త్రీయ సోషలిజం ఉద్భవించగలదు. చరిత్రను భౌతికదృష్టితో అర్థంచేసుకొనడం గతితార్కిక పద్ధతిద్వారానే సాధ్యమౌతుంది. నేడు బూర్జువావర్గానికీ, శ్రామికవర్గానికీ జరుగుచున్న వర్గపోరాటం చారిత్రక భౌతిక వాదదృష్టితో చూస్తేనే తెలుస్తుంది. జర్మను బూర్జువా పండి

---

** "జర్మనుదేశములోనే" అనటంకలం జారటంవల్ల వచ్చినపొరబాటు "జర్మనులలో" అని వుండవలసినది. ఎందుచేతనంటే శాస్త్రీయ సోషలిజమును సిద్ధాంతీకరించుటకు ఉత్తమమగు జర్మను తత్వశాస్త్రమెంత అవుసరమో, ఇంగ్లండు ఫ్రాంసులలో అభివృద్ధిచెందిన ఆర్థిక సాంఘిక పరిస్థితులు కూడా అంతే అవుసరం. ఇప్పటికంటె 1840 లో జర్మనీలోని ఆర్థిక రాజకీయ పరిస్థితులు ఇంకా వెనుకబడివున్నవి; అట్టివాటినిబట్టి వికృతరూపముగు సోషలిజమే సిద్ధాంతీకరింపబడివుండేది. ("కమ్యూనిస్టు ప్రణాళిక, 3వ భాగంలో జర్మను సోషలిజమూ, లేక సరియగు సోషలిజమూ" అన్న భాగాన్ని చూడగోర్తాను) ఇంగ్లాండు, ఫ్రాంసులలోని పరిస్థితులను జర్మను గతితార్కిక వాదం సహాయంతో పరిశీలించటంద్వారానే సరియగు ఫలితం వస్తుంది. కాబట్టి ఈ దృష్టితో చూచినప్పుడు, శాస్త్రీయ సోషలిజం జర్మనుదేశభావం గాక, అంతర్జాతీయ సృష్టి అని చెప్పవచ్చును. (ఎంగెల్సు)

తమ్మన్యులు మహామహులగు జర్మనుతత్వవేత్తలను మర్చిపోతే, ఈ మహామహులు అనుసరించిన గతితార్కికపంథాను వదలి తమ మిడిమిడిజ్ఞానాన్ని ప్రదర్శిస్తే, ఆధునిక ప్రకృతిశాస్త్రాల సహాయంతో గతితార్కికవాదసత్యాన్ని నిలబెట్టవలసిన బాధ్యత మాపైనబడింది. జర్మను సోషలిస్టులమైన మేము సెయింట్ సైమన్, ఫొరియర్, ఓవెన్ల వారసులమే గాక కాంటు ఫిక్టే, హెగెల్ తత్వవేత్తలకుకూడా వారసులమని సగర్వంగా చెప్పుకుంటాము.

సెప్టెంబరు 21, 1882
లండను

ఫ్రెడరిక్ ఎంగెల్సు.

# 1892 ఇంగ్లీషు ముద్రణకు ఉపోద్ఘాతంనుండి.

ఈ చిన్నగ్రంథం మరొక పెద్దగ్రంథంలోని భాగం. 1875 ప్రాంతంలో, బెర్లిన్ విశ్వవిద్యాలయోద్యోగియగు డాక్టర్ డూహ్రెంగ్ తాను సోషలిస్టునైనానని ఆర్భాటంగా ప్రకటించుకొన్నాడు. అంతటితో ఆగలేదు; సవిస్తరమైన ఒక సోషలిస్టు సిద్ధాంతాన్ని, సమాజాన్ని మరామత్తుచేస్తానికై ఒక పూర్తిప్లానును ప్రపంచానికి బహూకరించాడు; ఇట్టి పెద్దలకు సహజమగు గుణాన్నికూడా ప్రదర్శించాడు; తన పూర్వీకులగు తత్వవేత్తలపై విరుచుకుపడ్డాడు; మరీ ముఖ్యంగా మార్క్సుయెడ తనకున్న అక్కసునంతా వెళ్ళబోసుకున్నాడు.

జర్మను సోషలిస్టుపార్టీలోని ఐసెనాక్ పక్షమూ లాసెల్లీ పక్షమూ ఏకమైనవి; ఈవిధంగా తమ బలాన్ని ఎంతో వృద్ధి

గావించుకొని, ఉభయపక్షాలకు సమానంగా శత్రువేమైన వారిపై ఈ బలాన్ని ప్రయోగించ సిద్ధమైనవి. సరిగ్గా ఇట్టి తరుణంలోనే డాక్టరు డ్యూహ్రింగు రంగుఫిరాయించాడు. జర్మనీలో సోషలిస్టుపార్టీ ఒక బలీయమగు శక్తిగా అభివృద్ధి అగుచున్నది, ఇది అజేయమగు శక్తిగా కావాలంటే, ఈ పార్టీలో ఇప్పుడే ఏర్పడిన ఐక్యతను కాపాడాలి. డాక్టరు డ్యూహ్రింగు ఎత్తులు ఈ అవసరాన్ని కలిగిస్తున్నవి. ఈ డాక్టరు సోషలిస్టుగా మారగానే తనచుట్టూ ఒక ముఠాను జేర్చుకొని, భవిష్యత్తులో ఒకపార్టీని ఏర్పర్చుటకై బీజాలను నాటసాగాడు. కాబట్టి మాకు ఆతని సవాలును అంగీకరించక తప్పలేదు. ఆతడు ఇష్టపడనీయండి, ఇష్టపడకపోనీయండి, అతనితో నేము కుస్తీపట్టక తప్పటంలేదు.

ఇదొక పెద్ద కష్టం కాకపోయినా బండపని. జర్మనులు తీవ్రవాదమగు అఖండ ప్రతిభనుగాని, ప్రతిభాసంపన్నమగు తీవ్రవాదమునుగాని — నీవేదైనా అనుకో — కలిగియున్న జాతియని అందరికీ తెలిసిన విషయమే. ఎవరైనా ఏదైనా ఒక నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తుంటే, అది ఆపాద మస్తకమూ సర్వాంగపరిపూర్ణంగా వున్నదని చూపెట్టాలి. ఆదికాలంనుండీ వున్న తర్కశాస్త్రమైతేనేమి, సృష్టిమూలసూత్రమైతేనేమి, ఈతని నూతన సిద్ధాంతాన్ని రుజువుచేసేటానికే పుట్టి వున్నవికాని మరెందుకూ కాదనికూడా ఈతడు చూపించాలి. ఇదీ జర్మన్ల ప్రత్యేకత. ఈ జాతిగుణం డాక్టరు డ్యూహ్రింగులో పూర్తిగా పుంజీభవించిఉన్నది. చూడండి: మానసిక, నైతిక, ప్రాకృతిక, చారిత్రిక విషయములన్నిటికీ సంబంధించిన

సర్వాంగ సౌష్టవమగు "తత్వశాస్త్రం" ఒకటి, పరిపూర్ణమైన "అర్థశాస్త్రం, సోషలిజం," ఒకటి, "అర్థశాస్త్ర సూక్ష్మ విమర్శన" ఒకటి, మూడూ మూడు చాటభారతాలు; లోపలా బైటాకూడా పాషాణాలు. పూర్వపు అర్థశాస్త్రజ్ఞులయొక్క తత్వవేత్తలయొక్క, అందులోనూ ముఖ్యంగా మార్క్సుయొక్క సిద్ధాంతాలకు వ్యతిరేకంగా మోహరించబడిన వాదనలు; ఒక్క మాటలో చెప్పాలంటే "సైన్సులో విప్లవం" ఇదిడాక్టరు డూహెర్రింగు సంతానం. వీటితోనే నేను యుద్ధంచేయవలసి వచ్చింది. కాలము దూరముల మొదలుకొని ద్విధాతుప్రమాణము (Bimetallism)* ను గూర్చిన దృక్పధాలవరకూ, పదార్థము, చలనము అనాదిసిద్ధము లనుసిద్ధాంతము మొదలుకొని వీటి నియమాలు నశ్వరమనే భావంవరకూ, డార్విన్ యొక్క "స్వాభావిక వరణము" అను (Natural Selection)* * సిద్ధాంతం మొదలుకొని భవిష్యత్సమాజాలలో యువకుల విద్యాబోధనవరకూ; ప్రపంచంలో వుండే సమస్త విషయాలను గూర్చి నేను తడవవలసివచ్చినది. ఏదైనాకానీయండి; లోకంలో వుండే సమస్తవిషయాలనూ నా ప్రత్యర్థి తడవటంమూలకంగా

---

*నాణెములకు బంగారం, వెండి, రెండు ధాతువులూ ప్రమాణంగా వున్నప్పుడు ద్విధాతుప్రమాణం అని అంటారు. (అనువాదకుడు)

**ప్రాణివర్గం, వాటి పరిమాణంలో, పరికరాలకు అనువైనట్లు తమ జీవన విధానాన్ని మార్చుకుంటూ వుంటాయనీ ఇందువల్ల క్రమంగా నూతన ప్రాణివర్గాలు జనించుననీ, పరికరాలకు అనువర్తించి జీవనాన్ని మార్చుకో గలిగిన వర్గాలే బ్రతకగలవనీ, మార్చుకోలేనివి నశించుననీ డార్విన్ సిద్ధాంతం. ఈ సిద్ధాంతమునే (నాచురల్ సెలక్షన్) "స్వాభావిక వరణము" అని అంటాము. (అనువాదకుడు)

నేనూ, ఆ సిద్ధాంతాలను ఖండిస్తూ అనేకవిషయాలపై నా యొక్క, మార్క్సుయొక్క అభిప్రాయాలేమిటో స్పష్టంగా ఒక్కపుస్తకంలోనే, క్రమరీతిలో తెల్పుటకు వీలుకల్గింది. ఈ కారణంవల్లనే ఈ బండపనిని నా నెత్తిమీద వేసుకోవలసి వచ్చినది.

మొట్టమొదటగా, నా జవాబు లీప్జిగునుండి ప్రచురింపబడే సోషలిస్టుపార్టీ ప్రధాన పత్రికయగు "నార్వార్ట్సు"లో ప్రకటింపబడినది; పిమ్మట పుస్తకరూపంలో ప్రకటింపబడినది. ఈ పుస్తకంపేరు "మిష్టర్ డూహ్రింగు సైన్సులో తెచ్చిన విప్లవం." దీని ద్వితీయముద్రణ 1886 లో జ్యూరిచ్ నుండి ప్రకటింపబడినది.

నా స్నేహితుడైన పాల్ లెఫార్గ్ (ప్రస్తుతం ఫ్రెంచి శాసనసభలో లిల్లీ పట్టణ ప్రతినిధి) కోర్కెపై ఈ 'డూహ్రింగు సిద్ధాంతఖండనం'లోని 3 అధ్యాయాలను కలిపి ప్రస్తుత గ్రంథంగా ప్రచురించ ఏర్పాటుచేశాను. దాని నాతడు తర్జుమా జేసి, "శాస్త్రీయ సోషలిజం, ఊహాజనిత సోషలిజం" అనే పేరుతో 1880 లో ప్రచురించాడు. ఈ ఫ్రెంచిమాతృకనుండి పోలిషు, స్పానిషు ముద్రణలు వెలువడినవి. 1883 లో జర్మను భాషలో మిత్రులు దీనిని వెలువరించారు. ఈ జర్మనుప్రతి ననుసరించి ఇటాలియన్, రష్యన్, డేనిష్, డచ్చి, రుమేనియన్ భాషలలో ఈ పుస్తకం ప్రచురింపబడినది. ఈ విధంగా, ఈ చిన్నపుస్తకం, ఇంగ్లీషుప్రతితో కూడా కల్పి, మొత్తం 10 భాషలలో ప్రకటితమైనది. నాకు తెలిసినంతవరకూ మరే యితర సోషలిస్టుగ్రంథమూ, ఆఖరుకు "కమ్యూనిస్టు ప్రణా

ళిక''గాని, మార్క్సు "కాపిటల్''గాని ఇన్నిసార్లు తర్జుమా చేయబడలేదు. జర్మనీలోనే 4 ముద్రణలవరకూపోయి 20000 ప్రతులు అమ్ముడుపోయినవి.

ఈ పుస్తకంలో నూతనంగా ఉపయోగింపబడిన అర్థ శాస్త్రపదాలేవైనావుంటే, అవి మార్క్సు 'కాపిటల్' ఇంగ్లీషు ప్రతిలో ఉపయోగించినట్టి పదాలే. స్వంతవుపయోగానికిమాత్రమేగాక వస్తువులు అమ్మకమునకై వుత్పత్తి గావింపబడే విధానానికి, అంటే, "ఉపయోగపువిలువలు''గాగాక "సరుకులు''గా వుత్పత్తిఅయ్యే విధానానికి మేము "సరుకులవుత్పత్తి'' అని పేరుపెట్టాము. మారకమునకై వస్తువులు వుత్పత్తికావటం ప్రారంభమైనప్పటినుండీ ఇప్పటివరకూ ఈ సరుకుల ఉత్పత్తి శకం సాగుతూనేవున్నది. ఇది కాపిటలిస్టు ఉత్పత్తివిధానంలో; అంటే, ఉత్పత్తి సాధనాల యజమానియగు కాపిటలిస్టు, తమ శ్రమశక్తి మినహా మరేయితర ఆస్తిని కలిగియుండనటువంటి కార్మికులను వేతనాలకు కుదుర్చుకొని, వారిచే ఉత్పత్తిని గావిస్తూ, తన పెట్టుబడితో ఉత్పత్తిఅయిన సరుకుల అమ్మకంపై వచ్చిన మొత్తంలో ఖర్చులుపోను మిగిలిన సొమ్మును తన జేబులో వేసుకొనుచూవుండే విధానంలో; ఈశకం పూర్తిగా అభివృద్ధి చెందివుంటుంది. మధ్యయుగాల నాటినుండి ఇప్పటివరకూ పారిశ్రామిక వుత్పత్తిచరిత్రను మేము మూడుదశలుగా విభజించాము.

1. మొదటిదశలో చేతిపరిశ్రమలుండేవి. వృత్తినిపుణులగు మేస్త్రీలు ఉమేజువారీలను (పని నేర్చుకొనేవారిలో ఒకతరహా Journeymen), అభ్యాసకులను (పనినేర్చుకొనేవారిలో

మరొకతరహా apprentices) పెట్టుకొని వుత్పత్తిని సాగించే వారు; ప్రతి శ్రామికుడు ఒక సరుకును పూర్తిగా తానే స్వయంగా తయారు చేసేవాడు.

2. రెండవదశలో పారిశ్రామిక విధానం(Manufacture) వుండేది. అనేకమంది కార్మికులు ఒకే కర్మాగారంలో జేరి పనిజేస్తారు. శ్రమ విభజనప్రకారం ఆ కర్మాగారంలోనే పూర్తిసరుకు తయారౌతుంది; అనగా ఒక్కొక్కవస్తువు ఒక కార్మికునినుండి మరొక కార్మికునకు జరుగుతూ చివరకార్మికుని నుండి పూర్తిగాతయారైన సరుకు బయటపడేవిధంగా వుత్పత్తి జరుగుతుంది.

3. మూడవదశ ఆధునిక పారిశ్రామికవిధానం. ఈ దశలో యంత్రములు ఆవిరితో లేక విద్యుచ్ఛక్తితో నడుప బడుతాయి. ఈయంత్రపు ఏజంటు పని జేస్తూవుండగా కార్మికుని పనియంతా, దానిని తనిఖీ చేస్తూవుండటం, కాస్త దిద్దుబాటుచేస్తూ వుండటంమాత్రమే.

---

ఫ్రెడరిక్ ఎంగెల్స్

# ఊహాజనితసోషలిజం: శాస్త్రీయసోషలిజం

## I

ఆధునికసోషలిజం ఒకవైపున ఈనాడు సమాజంలో ఆస్థిపరులకూ, ఆస్థి లేనివారికీ మధ్యజరిగే పోరాటాన్ని చూడటంవల్లనూ, కాపిటలిస్టులకూ, కార్మికులకూ మధ్యజరిగే వర్గ పోరాటాన్ని చూడటంవల్లనూ, మరోవైపున వుత్పత్తి విధానంలోవున్న అరాజకాన్ని చూడటంవల్లనూ ఏర్పడిన సిద్ధాంతమే. సిద్ధాంతరూపంలో చూస్తే ఇది 18 వశతాబ్దపు ఫ్రెంచి తత్వవేత్తల * సిద్ధాంతాలను ఇంకా ముందుకు సరియైన మార్గాలలో తీసుకుపోవటంగానే కన్పిస్తుంది. సోషలిజం యొక్క మూలం భౌతికకారణాలు ఆర్థికకారణాలలో ఎంతిగా పాతుకొని వున్నా, ఏయితర నూతనసిద్ధాంతమువలెనే ఇది కూడా, తనకు పూర్వమున్న విజ్ఞానసంపదను వుపయోగించుకొని దానితో సంబంధము కల్గించుకొనియే అభివృద్ధికావలసిన అవసర మున్నది.

తమ ముందు భవిష్యత్తులో రానున్న విప్లవమునకై ప్రజల భావాలనన్నిటినీ అభిముఖంగా వుంచ ప్రయత్నించిన

* 1789_94 లో ఫ్రెంచి బూర్జువా విప్లవప్రారంభదినాలలో తత్వశాస్త్రంలోనూ, సైన్సులోనూ నూతనసిద్ధాంతాలను ప్రతిపాదించిన అనేక మంది తత్వవేత్తలున్నారు. వీరినే ఎంగెల్సు తెలుస్తున్నాడు. ఈతత్వవేత్తలలో ప్రధానులు వాల్టేరు, రూసో మున్నగువారు, డిడిరాట్ మున్నగు ఎంసైక్లోపీడియస్టులు. (అనువాదకుడు)

ఫ్రెంచి మహాపురుషులు స్వయంగా తీవ్రవిప్లవ ధోరణిలో ప్రవర్తించారు. ఏ బాహ్య అధికారాన్నీ వారు గుర్తించలేదు. ప్రకృతినిగూర్చిన భావాలేమి, సమాజమేమి, రాజకీయవ్యవస్థ ఏమి, మతమేమి, ప్రతిదీ వారి నిశిత విమర్శనకు గురియైనది. ప్రతిదీ హేతువాదము (రీజన్) ముందు నిలబడి తన బ్రతుకును తేల్చుకొనవలసినదే; లేదా బ్రతుకుపై ఆశ వదలుకొనవలసినదే. దేని తాహతును నిర్ణయించాలన్నా హేతుబుద్ధి వుపయోగించబడేది. హెగెల్ చెప్పినట్లుగా, ప్రపంచం ఆ కాలంలో తన శిరస్సుపై నిలబడింది. * అంటే మానవుని

* ఫ్రెంచివిప్లవాన్ని గూర్చి హెగెల్ వ్రాసిన భాగం ఇది.

"ఒక్కసారిగా బుద్ధి, విచక్షణ తలయెత్తి నిలబడినది. పాతబడిన అధర్మవాదం దీనిముందు నిలవడలేకపోయింది. న్యాయబుద్ధియే, విచక్షణయే నేడు శాసనమైనది. ఇకముందు ప్రతిదీ ఈ పునాదిపైననే ఆధారపడివుండాలి. సూర్యమండలం ఎప్పుడి గ్రహాలు దానిచుట్టూ తిరగటం ప్రారంభమైన ఇన్నాళ్ళకు మొట్టమొదటిసారిగా మానవులు తమ తలలపై తాము నిలబెటటం చూస్తున్నాము. అంటే బుద్ధిబలంపై నిలబడి, బుద్ధినిబట్టి వాస్తవమును నిర్మించటం ప్రారంభమైనది. హేతువాదమే ప్రపంచాన్ని పరిపాలిస్తుంది అని మొట్టమొదటగా చెప్పినవాడు అనగ్జగోరస్. తిరిగి ఇప్పటికి, భావజగత్తుపై మానవుని బుద్ధి రాజ్యంచేయాలని మానవుడు గుర్తించటం జరిగింది. ఇది ఆనాడు అద్భుతమగు సూర్యోదయం. ఈ సూర్యోదయమునకు నివాళులిచ్చుటకై మేధావులందరూ ఆకాలంలో పూనైనారు. ఆకాలంలో మహోన్నతమగు ఆవేశం ప్రజల నందరినీ ఊపివేచింది. ఈ బుద్ధిప్రభావం వల్ల ప్రపంచమంతా పులకించినది. ఇప్పుడే భగవంతుడు మానవునితో లీనమైనట్లుగా ప్రపంచమంతా సంతోషించింది," ("చరిత్ర తత్వం" హెగెల్)

హెగెల్ పండితుడు ప్రతిపాదించిన అపాయకరమగు ఇట్టి విప్లవసిద్ధాంతములను నిర్వ్యాంచేయుటకై సోషలిస్టు మూలసూత్రాన్ని మనం ప్రతిపాదించ సమయం ఏతెంచలేదా? (ఎంగెల్సు నోటు)

ప్రతిచర్యకూ, జీవనక్రమమునకూ మూలం మానవుని శిరస్సు, ఆతని బుద్ధివిశేషంవల్ల ఏర్పడిన సిద్ధాంతాలూ అని ఒక అర్థంలోనూ, ఈసిద్ధాంతాలకు విరుద్ధంగా వాస్తవికవిషయాలు వున్నవి కాబట్టి అవి ఆపాదమస్తకం తల్లక్రిందులుగా వున్నవని విశేషార్థంలోనూ, ఈ హెగెల్ ఈసత్యాన్ని ప్రతిపాదించాడు. సమాజంయొక్క, ప్రభుత్వంయొక్క పూర్వరూపాలు, ఆచార సిద్ధంగా వచ్చే పాతభావాలు, ఇవన్నీ హేతుబద్ధం కావన్న వుద్దేశంతో తీసి పెంటపోగుపై విసరివేయబడినవి. ఇంతవరకు ప్రపంచంలో పక్షపాతం రాజ్యమేలింది; అందుచే ఏనుకటి ప్రతివిషయమూ దయార్ద్రదృష్టితోనో, ఏహ్యాభావంతోనో చూడాలి. మొట్టమొదటసారిగా ఇప్పటికి అరుణోదయమైంది. హేతువాదం సింహాసన మెక్కింది; ఇకనుండి మూఢనమ్మకాలు, స్వాధికారం, శోషణ, అన్యాయముల బదులు శాశ్వతసత్యం, శాశ్వతన్యాయం ప్రకృతిమూలమగు సమానత్వం, మానవుని జన్మహక్కులు చలామణీకాగలవు. ఇవి ఫ్రెంచి తత్వవేత్తల సిద్ధాంతాలు.

కాని ఆనాడు ఫ్రెంచితత్వవేత్త లూహించిన హేతుబద్ధరాజ్యం ఆదర్శరూపమగు బూర్జువారాజ్యంకాక మరేమీ కాదని నేడు మనం చూస్తున్నాము. శాశ్వతన్యాయం అంటె బూర్జువాన్యాయంగా పరిణమించినది; సమానత్వం అంటే ధర్మశాస్త్రం దృష్టిలో అందరూ సమానులే అనే బూర్జువా సిద్ధాంతంగా తేలింది; మానవుని జన్మహక్కులలో స్వంత ఆస్తిహక్కు ఒకటియని నిరూపించబడినది; హేతుబద్ధమగు

రాజ్యం, రూసో ప్రతిపాదించిన సోషల్ కాంట్రాక్టు * చివరకు బూర్జువా ప్రజాస్వామికంగా పరిణమించినదనీ, అంతకుమినహా అది మరొకవిధంగా పరిణమించదనీ తెలుసుకొన్నాము. వారి పూర్వీకులవలెనే, 18 వ శతాబ్దంలోని ఈ ఫ్రెంచి మహా మేధావులుకూడా తమకాలం పరిస్థితు లేర్పర్చిన హద్దులను దాటి ముందుకుపోలేకపోయారు.

జమీందారీ ప్రభుత్వవర్గానికీ, దానికి వ్యతిరేకంగా, ఇతర ప్రజాసామాన్యం అంతటియొక్క ప్రతినిధిగా నిలబడివున్న బూర్జువావర్గానికీ మధ్య వైరుధ్యం వుండనేవున్నది. దీనికి తోడుగా దోచుకునేవారికీ, దోచుకోబడేవారికీ మధ్య, సోమరు లగు భాగ్యవంతులకు, కష్టజీవులగు నిరుపేదలకు మధ్య వైరు ధ్యంకూడా వున్నది. సరిగ్గా ఈ కారణంవల్లనే, బూర్జువా వర్గప్రతినిధులు తమ ఒక్కవర్గంయొక్క ప్రతినిధులుగానేకాక, బాధితులగు మానవలోకం అంతటియొక్క ప్రతినిధులుగా ముందుకురాగల్గారు. ఇంతేగాదు; బూర్జువావర్గం పుట్టుకతోనే

* జీన్ జాక్విస్ రూసో (జననం 1712 మరణం1798) 1789_94 లలో జరిగిన ఫ్రెంచి విప్లవముయొక్క నాంది కాలంలో బూర్జువా విప్లవపక్షం యొక్క ప్రతినిధి. స్వతంత్రులై, ఒకరికొకరు ఆధారంగావుండి జీవించే మాన వులమధ్య స్వచ్ఛందంగా కుదిరిన 'సోషల్ కాంట్రాక్టు' (సంఘమంతటికీ కుదిరిన ఒప్పందము) నుండే సమాజంగాని, రాజ్యాంగయంత్రంగాని పుట్టుక వచ్చిందని, కాని క్రమముగా సామాజిక వ్యవస్థలో అసమానత్వం ఏర్పడి, సమాజం వక్ర రూపం పొందినదని ఈతని సిద్ధాంతము. ప్రకృతిసిద్ధంగా మానవులు సమా నులు, స్వతంత్రులు; కాబట్టి సమాన రాజకీయ హక్కులు కల్గివుండాలి; ధర్మ శాస్త్రదృష్టిలో అందరూ సమానులుగా పరిగణింపబడాలి; మానవులు తిరిగి స్వచ్ఛందమగు సోషల్ కాంట్రాక్టుద్వారా తమ మధ్య సమానత్వమును, స్వతం త్రతను ఏర్పర్చుకోవాలి; ఇది రూసోసిద్ధాంతము. (అనువాదకుడు)

దాని ప్రతియోగశక్తి (ante thesis) కూడా పుట్టింది; కాపిటలిస్టులు కూలికిపనిచేసే కార్మికులు లేకుండా వుండలేరు. మధ్యయుగాలనాటి వర్తకశ్రేణిలోని పట్టణవాసులు ఏవిధంగా నేటి బూర్జువావర్గంగా తయారైనారో అదేవిధంగా ఆ వర్తకశ్రేణిలోని ఉమేజువారీలు, రోజువారి కార్మికులు నేటి శ్రామిక వర్గంగా తయారైనారు. బూర్జువావర్గం జమీందారీ ప్రభుత్వవర్గంతో తమ పోరాటాన్ని సాగిస్తూ, ఇతర శ్రమజీవులందరికీ ప్రతినిధిగా నిలబడిన తరుణంలోనే, తర్వాత తర్వాత శ్రామికవర్గంగా ఏర్పడిన కష్టజీవులవర్గం అప్పుడప్పుడూ స్వతంత్రంగా నిల్చి పోరాడటాన్నికూడా ప్రతి బూర్జువా వుద్యములోనూ చూస్తాము, ఉదాహరణకు: జర్మనీలోవచ్చిన రిఫర్మేషన్, రైతు పోరాటములలో *థామస్ ముంజర్ పాత్ర, ఇంగ్లీషు మహావిప్లవంలో లెవెలర్ల పాత్ర, ఫ్రెంచి మహావిప్లవంలో బాబూఫ్ పాత్ర ** ఇవి బూర్జువా

---

* క్రిష్టియన్ మతంలో మతాధిపతులు పోపునాయకత్వాన సాగించే నియంతృత్వానికి వ్యతిరేకంగా బయలుదేరినదే రిఫర్మేషన్. జమీందారీ వ్యవస్థతో పోరాడే బూర్జువావర్గం, జమీందారీ వ్యవస్థలోని ఒక ప్రధానాంగమగు మతాధిపతుల ముఠాపై తిరుగుబాటుగా ఈ రిఫర్మేషన్‌కు నాయకత్వం వహించారు. రిఫర్మేషన్, రైతుపోరాటాలు జర్మనీలో 16 వ శతాబ్దంలో వచ్చినవి. (అనువాదకుడు)

** బాబూఫ్ కమ్యూనిజమును ప్రబోధించాడు. మానవులందరూ సమానులని ఈతని సిద్ధాంతం. కుట్రదారుల సంఘాలేర్పడి, రహస్యంగా కుట్రలను బన్నుటద్వారా పెద్ద తిరుగుబాట్లను తేవాలనీ, ఆవిధంగా కమ్యూనిజమును నెలకొల్పాలని ఈతని వాదం. ఇట్టి తప్పువాదం ఆనాటి శ్రామికవర్గం యొక్క అపరిపక్వదశను తెలియజేస్తుంది. (అనువాదకుడు)

వుద్యమాలలో కష్టజీవుల స్వతంత్ర పోరాటాలు. ఇంకా పరిపక్వ దశకురాని ఈ వర్గం గావించిన విప్లవ తిరుగుబాట్లకు అనుగుణ్యాంగా సిద్ధాంతాలుకూడా బయలుదేరినవి. ఒక ఆదర్శ ప్రాయమగు సమాజం, అందలి ఆదర్శ పరిస్థితులనుగూర్చి 16, 17 శతాబ్దాలలోనే ఊహాగానం చేయబడింది. * * * 18 వ శతాబ్దంలో నిజంగానే కమ్యూనిష్టు సిద్ధాంతాలు (మోరెల్లీ, మోబ్లేలచే) ప్రతిపాదింపబడినవి. ఒక్క రాజకీయ హక్కుల లోనేగాక వ్యక్తుల సామాజిక పరిస్థితులలోగూడా సమానత్వాం కావాలనే కోర్కె బయలుదేరింది; ఒకే వర్గానికివుండే స్వాధికారాలు (Privileges) పోవాలనేగాక, వర్గ విభజనమే పోవాలనే కోర్కె బయలుదేరింది. పూర్వాం స్పార్టను జాతి వారివలెనే, జీవిత సౌఖ్యములనన్నిటినీ విసర్జించి కఠోరమగు జీవితాన్ని గడపుట యనే రూపంలో కమ్యూనిస్టు నూతన సిద్ధాంతము బయలుదేరింది. వెనువెంటనే ప్రసిద్ధులయిన ముగ్గురు యుటోపియన్లు (ఊహాజనిత సోషలిస్టు భావాలు కలవారు) జన్మించారు. శ్రామికవర్గ భావాలతోబాటు ఇంకా బూర్జువా భావాల వాసనను కల్గివున్నట్టి సెయింట్ సైమన్; కాపిటలిస్టు ఉత్పత్తివిధానం బాగా అభివృద్ధియై, దానిలో పరస్పర వైరుధ్యాలు బాగా స్పష్టపడిన దేశంలో, ఈ పరిణామంవల్లనూ, ఫ్రెంచి భౌతికవాదంవల్లనూ ప్రేరే

* * * 16 వ శతాబ్దంలో థామస్ మూర్; 16, 17, వ శతాబ్దాలలో కాంపనెల్లా ఇట్టి ఊహాజనిత సోషలిజమునుగూర్చి గ్రంథాలు వ్రాసారు. థామస్ మూర్ వ్రాసిన 'యుటోపియా' (ఊహాప్రపంచం) అనే గ్రంథం చాలా ప్రశస్తి జెందినది. ఆయన 'యుటోపియా' లో "స్వంత ఆస్తిలేని ఆదర్శ సమాజం" వుంటుంది. (అనువాదకుడు)

పింపబడి, వర్గ వైరుధ్యాలను తొలగించుటకై ఒక నిర్ణీతమగు కార్యక్రమంతో వచ్చిన రాబర్టు ఓవెన్, ఫోరియర్లు అవతరించారు.

వీరి ముగ్గురిలోనూ సమానంగా వున్న విశేషమేమిటంటే, చారిత్రికంగా అప్పటికే ముందుకు వచ్చిన శ్రామిక వర్గానికి ప్రతినిధులుగా వీరు నిలబడలేదు. ప్రబోధయుగం (Enlightenment) నాటి తత్వవేత్తల వలెనే వీరున్నూ ఒక వర్గంయొక్క విముక్తిగాక సర్వమానవకోటి యొక్క విముక్తినీ కాంక్షించారు. వారివలెనే వీరుకూడా హేతువాదం యొక్క శాశ్వతన్యాయం యొక్క రాజ్యాన్ని ప్రతిష్టించ దలచారు; కాని ఫ్రెంచితత్వవేత్తల ఆదర్శరాజ్యానికీ, వీరి ఆదర్శరాజ్యానికీ చాలా తేడామాత్రం వున్నది. వెనుకటి తత్వవేత్తల సిద్ధాంతాలపై నిర్మింపబడే బూర్జువా ప్రపంచం కూడా వీరి దృష్టిలో అన్యాయపూరితమూ, హేతువిరుద్ధమూ అయినట్టిది. కాబట్టి జమీందారీ వ్యవస్థ, ఇతరవ్యవస్థలవలెనే బూర్జువా వ్యవస్థను కూడా వీరు కాల దన్నివేసారు. ఇంత వరకు స్వచ్ఛమగు హేతువాదమూ, న్యాయమూ ప్రపంచాన్ని అధిష్టించివుండలేదంటే దానికి కారణం వాటి నెవ్వరూ గ్రహించకపోవటమే. అపూర్వప్రతిభను కల్గివున్న మహాజ్ఞాని జన్మించి వుండకపోవటం వల్లనే ఇది జరిగింది. కాని ఇప్పు డట్టి మహాజ్ఞాని జన్మించాడు; సత్యమును కనుగొన్నాడు; సరిగ్గా ఇప్పుడే ఈ మహాజ్ఞాని జన్మించుటకు వేరేమీ కారణం లేదు. ఈ సత్యం ఇప్పుడే కన్గొనబడుటకు కూడా ప్రత్యేకకారణం ఏమీలేదు. చారిత్రికపరిణామం

వల్ల తప్పనిసరిగా సంభవించే సంఘటన కానేకాదు; ఇప్పుడే ఈ మహాజ్ఞాని జన్మించటం వట్టి ఘాన్సుమాత్రమే. ఈతడు 500 ఏండ్ల క్రితం పుట్టియున్నా పుట్టివుండవచ్చు; అది సంభవమే. అదేగనుక సంభవించివుంటే ఈ 500 ఏండ్ల బాధ, తప్పులు, పోరాటాలు కల్గకనే వుండేవి; ఇవీ వీరి అభిప్రాయాలు.

ఫ్రెంచివిప్లవానికి బాటను సుగమంజేసిన 18వ శతాబ్దపు ఫ్రెంచితత్త్వవేత్తలు హేతువాదదృష్ట్యా ప్రతిదానినీ అనుశీలనం జేసేవారు. హేతుబద్ధమగు రాజ్యాంగవ్యవస్థ ఏర్పడాలి; హేతుబద్ధమగు సమాజవ్యవస్థ ఏర్పడాలి; శాశ్వత హేతువాదమునకు విరుద్ధమగు ప్రతీతి విసర్జించబడవలసినదే. కాని ఈశాశ్వత హేతువాదమనేది అప్పుడప్పుడే బూర్జువావర్గం క్రింద అభివృద్ధి అగుచున్న మధ్యతరగతియొక్క ఆదర్శ జగత్తు కాక మరేదీ కాదని గ్రహించగలము. కాబట్టి ఫ్రెంచివిప్లవం ఫలితంగా ఏర్పడిన హేతుబద్ధరాజ్యాంగవ్యవస్థనూ, హేతుబద్ధ సామాజికవ్యవస్థనూ చూస్తే తీరా ఏమిటది? లోగడ పరిస్థితులతో పోల్చి చూస్తే ఈ వ్యవస్థ ఎంత హేతుబద్ధంగా కన్పించినా, వాస్తవానికి ఇది పూర్తిగా హేతుబద్ధం కాదని తేలింది. హేతుబద్ధమగు రాజ్యాంగవ్యవస్థ కాస్తా బోల్తా కొట్టింది. రూసోఆశించిన 'సోషల్ కాంట్రాక్టు' 'భయానక పరిపాలన'*గా

---

* 1793_1794 లో ఫ్రెంచిప్రభుత్వం జాకోబిన్ల వశమైనది. విప్లవ నాయకులలో తీవ్రవాదులు ఈజాకోబిన్లు; విప్లవపూరితులగు మధ్యతరగతి ప్రజలనూ, కష్టజీవులగు ప్రజాసామాన్యానికీ ప్రతినిధులు వీరు. బూర్జువావర్గం యొక్క కుట్రలవల్ల విప్లవప్రభుత్వం పతనమయ్యే పరిస్థితులలో వీరి విప్లవ ప్రతిఘాతుకశక్తుల నణచివేయుటకై భయానకచర్యలకు పూనుకొన్నారు. దీనినే 'భయానక పరిపాలన' అని అంటారు. (అనువాదకుడు)

(Reign of Terror)గా పరిపూర్ణత జెందింది; దానితో బూర్జువా వర్గానికి తమ రాజకీయ సామర్థ్యంమీదనే అవిశ్వాసం ఏర్పడింది; ఇందుమూలకంగా, ప్రథమంగా డైరెక్టరేటు పరిపాలనకూ, * * పిమ్మట నెపోలియన్ నియంతృత్వానికీ దాసోహమన్నారు. శాశ్వత శాంతియని వాగ్దానం గావించబడినది అంతులేని జైత్రయాత్ర క్రింద పరిణమించినది. హేతుబద్ధ సామాజికవ్యవస్థకు పట్టిన గతికూడా ఇంతకన్న మెరుగేమీ కాదు. భాగ్యవంతులు బీదవారిమధ్య ఎడము, ప్రతియోగము మరింత హెచ్చినవి. లోగడ ఈఉభయ పక్షములమధ్య వారధిగా వర్తకశ్రేణులు, ఇతర స్వాధికారశ్రేణులు వుండేవి; మఠాలుగావించే ధర్మకార్యాలు ఈపక్షాలమధ్య వైరుధ్యాలను కొంతవరకు చల్లార్చేవి. కాని ఈ పైసంస్థలన్నీ రద్దుగావింపబడటంతో వుభయపక్షాలమధ్య వైరుధ్యం మరింత తీక్ష్ణరూపం దాల్చినది. "ఆస్తిస్వతంత్రత" అనే నినాదం జమీందారీవ్యవస్థ సంకెళ్ళను విదలించుకొని వాస్తవజన్మ నెత్తింది; కాని తీరాచూస్తే, మధ్యతరగతీ, సామాన్యరైతులూ తమ్ము నలిపివేసే పెద్దఆస్తిపరులకు తమ స్వల్పఆస్తులను అమ్మివేసుకునే స్వతంత్రంగా ఇది తయారైనది; అంటే, ఆస్తినిపోగొట్టుకొనే స్వాతంత్ర్యం మధ్యతరగతి ప్రజలకూ, సామాన్య రైతులకూ

* * జాకోబిన్ ప్రభుత్వం పతనమైనపిమ్మట 1794 లో ఏర్పడిన ఫ్రెంచి ప్రభుత్వానికి డైరెక్టరేటు అని పేరు. 1995 నుండి 1799 వరకు, అనగా నెపోలియన్ దానిని కూలద్రోసి రాజ్యాధికారాన్ని ఆక్రమించే వరకూ ఈ ప్రభుత్వం నిల్చివున్నది. ఫ్రెంచి జైత్రయాత్రయని ఎంగెల్సుచే పిల్వబడ్డ యుద్ధాలు నెపోలియను చే సాగించబడినవి. ఈతడు మొదట్లో డైరెక్టరేటులో కాన్సలుగావుండి, పిమ్మట చక్రవర్తియైనాడు. (అనువాదకుడు)

లభించినదన్నమాట. ఒకవైపున పారిశ్రామికోత్పత్తి కాపిటలిస్టుపద్ధతులపై అత్యంతోపద్రవంగా విజృంభిస్తున్నది; మరోవైపున, ఈపద్ధతులపై సమాజం నిల్చివుండాలంటే కార్మిక ప్రజాసామాన్యంయొక్క బీదరికం, బాధలు అత్యావసరమౌచున్నవి. కార్లైలు భాషలో, రొక్కపరిష్కారములే (Cash payments) అంతకంతకూ సమాజాన్ని బంధించివుంచే ఏకైక సూత్రమగుచున్నవి. నేరాలసంఖ్య ఏడాదికేడాదికి పెరుగుచున్నది. ఇంతవరకూ బాహాటంగా జరిగే జమీందారీ దుర్నయాలు ఇప్పుడు పూర్తిగా అంతరించకపోయినా, కొంతవరకూ మాటునబడినవి; వీటి స్థానే, ఇంతవరకూ కాస్త మరుగున పడివున్న బూర్జువా దుష్టత్వం ఒక్కసారిగా ఫెళ్ళున బహిరంగమైనది; వ్యాపార మంతకంతకూ దగాలోనికి దిగింది; విప్లవకాలంనాటి "సౌభ్రాతృత్వం" చివరకు వర్తకంలో పోటీగా, పోరాటములుగా, కుతంత్రములుగా, అసూయగా పరిణమించినది; దండనీతి స్థానాన్ని అవినీతి, లంచగొండితనం ఆక్రమించినవి; సమాజంలో అధికారాన్ని సంపాదించుటకు మీటగా కత్తికి బదులు ధనం వుపయోగపడజొచ్చింది; "కన్నెరికం" హక్కు (Right of first night) జమీందారీ ప్రభువులనుండి వర్తక పుంగవులకు సంక్రమించినది; కని విని ఎరుగనంతగా పడుపువృత్తి ప్రబలిపోయింది; వివాహమనే తంతు పడుపువృత్తికి లీగల్ రూపంగా, ఇదివరకువలెనే ఇప్పుడు కూడా వున్నది. దీనికితోడు వ్యభిచారంకూడా వృద్ధియైనది. ఒక్క మాటలో చెప్పాలంటే, ఈ "హేతువాదవిజయం" ద్వారా ఏర్పడిన సామాజిక, రాజకీయ వ్యవస్థలు, ప్రబోధ

యుగంనాటి ప్రవక్తలు వాగ్దానంచేసిన సామాజిక, రాజకీయ వ్యవస్థల వికృతరూపాలుగాక మరేమీకావు. ఈ విషయాన్ని రుజువుచేసే వ్యక్తులే కావలసివున్నది. వీరు ఈ శకంలో జన్మించనేజన్మించారు. 1802 లోనే సెయింట్ సైమన్ యొక్క "జినీవా వుత్తరాలు" ప్రకటింపబడినవి; ఫొరియరు, అవుసర సామగ్రినంతా సేకరించుకొనటాన్ని 1799 లోనే పూర్తిగావించినా, పుస్తక రూపంలో దానిని 1808 లోనే ప్రకటించాడు. ఆన 1800 సం॥ జనవరి 1 వ తేదీన 'న్యూలానార్కు' మేనేజిమెంటును రాబర్టు ఓవెన్ స్వీకరించాడు.

ఈదశలో, కాపిటల్ వుత్పత్తి క్రమమూ, దానితోబాటుగా వుండే బూర్జువా, శ్రామికవర్గాలమధ్య వైషమ్యాలు ఇంకా పూర్తిగా అభివృద్ధి జెందలేదు. అప్పుడే భారీ పరిశ్రమలు ఇంగ్లాండులో బయలుదేరినవి; కాని ఫ్రాంసులో ఇంకా బయలుదేరలేదు. భారీ పారిశ్రామికోత్పత్తియే ఒకవైపున ఉత్పత్తి విధానంలో విప్లవాన్నీ, ఉత్పత్తి విధానంయొక్క కాపిటలిస్టు స్వభావం అంతమును తప్పనిసరిచేసే వైరుధ్యాలనూ తెచ్చిపెడుతుంది. ఉత్పత్తి విధానంలోవుండే వైరుధ్యాలు, భారీ పారిశ్రామికోత్పత్తివల్ల ఉత్పన్నమైన బూర్జువా, శ్రామికవర్గాల మధ్యనేగాక, ఈ వుత్పత్తి విధానంవల్లనే కల్గే ఉత్పత్తిశక్తులు, మారకముల మధ్య కూడా ఏర్పడుతాయి; మరోవైపున, ఈ వైరుధ్యాలను అంతంజేసే సాధనాలుగూడా ఈ బ్రహ్మాండమగు వుత్పత్తి శక్తులలోనే అభివృద్ధిమైవుంటాయి. కాబట్టి 1800 నాటికి, ఈ నూతనసామాజికవ్యవస్థవల్ల వైరుధ్యాలు ఏర్పడుచున్న

వంటే, ఈ వైరుధ్యాలను సమయింపజేసే ఉత్పత్తిశక్తులుకూడా అప్పుడే ప్రారంభమౌచున్నవని చెప్పవచ్చును. పారిస్ పట్టణం లోని ఆస్తివిహీనులగు ప్రజాసామాన్యం 'భయానక పరిపాలన' కాలంలో కొద్దికాలమైనాగాని, అధికారాన్ని స్వీకరించి, బూర్జువావర్గాన్ని ఎదిరించికూడా, బూర్జువావర్గవిప్లవాన్ని జయప్రదం గావించారు; అయినప్పటికీ, అప్పటి కాలపరిస్థితు లలో ఆ అధికారాన్ని ఎక్కువకాలం నిల్పుకోనడం ఎంత అసాధ్యమో క్రమంగా రుజువైనది. ఈ ఆస్తివిహీనులనుండే, ఒక నూతనవర్గంగా తయారగుచూ బీదరూపంలోవున్న శ్రామికవర్గం అప్పటికి స్వతంత్రంగా రాజకీయచర్యలకు దిగగల సామర్థ్యాన్ని కల్గివుండలేదు. సామర్థ్యాన్ని కలిగివుండక పోయినా, సమాజంలో ఒక పీడితవర్గంగా తయారౌతూ వచ్చింది; ఇట్టి అసహాయస్థితిలో వీరికి సహాయం, వూత, బైటనుండి, మరొకరినుండి, రావలసి వుంటుంది.

సోషలిజం స్థాపకులను ఈ చారిత్రిక కాలపరిస్థితులు క్రమ్మివేసినవి. ఆనాటికి కాపిటలస్టు వుత్పత్తి ఇంకా అపరిపక్వ దశలోనే వున్నది; వర్గస్వభావముకూడా అపరిపక్వదశలోనే వున్నది; వీటికితగినట్లుగానే అపరిపక్వసిద్ధాంతములు బయలు వెడలినవి. ఉత్పత్తిక్రమంయొక్క అపరిపక్వదశ చాటున మరుగుపడిపోయి, ఈ సమాజ సమస్యల పరిష్కారమార్గం ఇంకా బహిర్గతం కాలేదు; కాబట్టి తమబుర్రలలోనుండే పరి ష్కారమార్గములను సృష్టించవలసివచ్చింది. సమాజంలో తప్పులు మినహా మరేమీ కానరావటంలేదు; ఈ తప్పులన్ని టినీ పరిహరించే కర్తవ్యం మానవుని విచక్షణాశక్తిది; జ్ఞాన

ముది. ఒక సర్వాంగసుందరమైన, నూతనమైన సమాజవ్యవస్థనే కనుగొనవలసియున్నది; దానిని మానవులపై రుద్దాలి; లేదా, ప్రచారంద్వారా వ్యాప్తినొందించాలి; లేదా, సాధ్యమైనచోట్ల మోడల్ పరిశోధనలద్వారా ప్రజలకు అలవడజేయాలి. ఈ యుటోపియన్ల భావాలివి. ఇట్టి సామాజిక వ్యవస్థలు జన్మతః ఊహాజనితముకాక మరేమవుతాయి? వాటి వివరాలు స్పష్టీకరింపబడేకొలదీ, అవి కేవలం భ్రాంతిరూపములేనని స్పష్టంకాగలదు.

ఈ విషయం అర్థంఅయితే, దీనినిగూర్చి ఇంకా ఎక్కువ చెప్పవలసిన అవుసరంలేదు. ఇది ఇప్పటికే బూజుపట్టిపోయింది. ఈ యుటోపియన్ల స్కీములను "అనంగతపుటూహ"లని విమర్శిస్తూ, వారికన్న తమ మిడిమిడిజ్ఞానమే గొప్పదని విఱ్ఱవీగే పండితశ్రేష్ఠులు ఈ విషయంపై తమ బుద్ధులను పాడుచేసుకోదలుస్తే చేసుకోనీయండి, వారు నిశ్చింతగా తమ వాచాలత్వాన్ని ప్రదర్శించుకోవచ్చు. మనంమాత్రం ఈ యుటోపియన్ల భావజగత్తులో, తమ్ము ఆవరించుకొనియున్న మబ్బు తెరలను చీల్చుకొని మిణుకుమిణుకుమంటూ ప్రకాశించే ఊహాలను, బీజరూపపు టూహాలను చూసి ఉత్సాహం పొందుతాము- ఈ పండితప్రకాండులకండ్లకివి కన్పించకపోయినా.

ఫ్రెంచిమహావిప్లవం బిడ్డయే సెయింట్ సైమన్. ఫ్రెంచి విప్లవంనాటి కాతని వయస్సు30 ఏండ్లు. విప్లవం తృతీయ శ్రేణి యొక్క విజయం ; అంటే స్వాధికారాలకు కల్గిన ప్రభువర్గంపై, మతాధిపతులపై, ఉత్పత్తిపరిశ్రమలలోనూ, వ్యాపారరంగంలోనూపనిజేసే ప్రజాసామాన్యం పొందిన విజయం. కాని చివ

రకు ఈ విజయం, తృతీయ శ్రేణిలో (Third estate) స్వల్పభాగం గావుంటూ, సమాజంలో ప్రత్యేకాధికారాలను కలిగివున్నట్టి ఆస్తిపరులగు బూర్జువావర్గం యొక్క విజయం మాత్రమేనని తేలింది. విప్లవకాలంలో ప్రభువర్గంయొక్క, మఠాలయొక్క ఆస్థులను స్వాధీనం జేసుకొని అమ్మివేసే కాలంలో విపరీతంగా స్పెక్యులేషన్ చేయటంవల్లా, మిలిటరీ కాంట్రాక్టులలో అపరిమిత మోసములను గావించటంవల్లా ఈ బూర్జువా వర్గం అతివేగంగా అభివృద్ధియైనది. ఈ దగాకోర్ల పెత్తనం మూలకంగానే, డైరెక్టరేటు పరిపాలనకాలంలో ఫ్రాంసుదేశం దాదాపు వినాశనస్థితికి వచ్చి, నెపోలియన్ అకస్మాత్తుగా రాజ్యాధికారాన్ని వశంజేసుకుంటానికి వంక ఏర్పడింది.

కాబట్టి సెయింట్‌సైమన్ దృష్టిలో, తృతీయ శ్రేణికీ స్వాధికారుల శ్రేణికీ మధ్యగల వైరుధ్యం 'కార్మికులకు' 'సోమరిపోతులకు' మధ్యగల వైరుధ్యంగా కన్పించినది. ఈ సోమరిపోతులు పూర్వపు స్వాధికారవర్గములు మాత్రమే కాదు, ఉత్పత్తిక్రమంలో గాని, పంపకం విధానంలోగాని ఏమాత్రం స్వయంగా పాల్గొనకుండానే అనాయాసపు ఆదాయమును సంపాదించే వారందరూ ఈ 'సోమరిపోతులవర్గం' క్రిందకు వస్తారు. 'కార్మికు' లంటే కేవలం కూలికి పనిజేసే కార్మికులే కాదు. పారిశ్రామికాధిపతులు, వర్తకులు, బాంకర్లు కూడా కార్మికులే. సోమరిపోతులు విజ్ఞానరంగంలోగాని, రాజకీయరంగంలో గాని ఇక నాయకత్వం వహించలేరన్నది ఫ్రెంచిమహావిప్లవం వల్ల రుజువైనది. ఆస్థిరహితుల వర్గాలకు కూడా ఈ సామర్థ్యం లేదని భయానకపరిపాలన వల్ల రూఢి

అయింది. అయితే ఇక ఎవరు నాయకత్వం వహించాలి? ఎవరు ఆజ్ఞాపాలనం గావించాలి? అనే ప్రశ్న సెయింట్ సైమన్‌ను ఎదుర్కొన్నది. రిఫర్మేషనుకాలంలో గుప్తమైన, పురోహితప్రాబల్యమున్నా 'నూతన క్రిష్టియన్ మతం' వుండేది; అది మతభావాల సమ్మేళనంగా వుండేది; కాని రిఫర్మేషన్ కాలం పిమ్మట అంతరించిపోయినది; సైన్సునూ, పారిశ్రామికోత్పత్తినీ నూతనమత బంధములచే మేళవింపజేస్తే తిరిగి యిప్పుడు ఈమతభావాల సమ్మేళనం నాయకత్వం వహించగలదని సెయింట్ సైమన్ వూహించాడు. సైన్సుమాటా? అది విద్వాంసులసొమ్ము, పరిశ్రమలా? అవి కష్టజీవులగు పారిశ్రామికాధిపతులయొక్క, బాంకర్లయొక్క, బూర్జువావర్గంయొక్క సొమ్ము. సెయింట్ సైమన్ వుద్దేశంలో, ఈబూర్జువావర్గమే సమాజంలోని పబ్లిక్ ఆఫీసర్లుగాను, ధర్మకర్తలుగాను వ్యవహరించ వుద్దేశింపబడి యున్నవారు; కాని కార్మికులతో పోల్చిచూస్తే వారు ఇంకా కొన్ని స్వాధికారములను కల్గియేవుంటారు.; ఆర్థికరీత్యా, కొంత లాభసాటిస్థానంలోనే వుంటారు. ప్రత్యేకంగా బాంకర్లు ఆర్థికపరపతిని (క్రెడిట్) అదుపులో వుంచడంద్వారా సామాజికోత్పత్తినంతా క్రమరీతిలో నడిపించవలసి వుంటుంది. ఫ్రాన్సులో ఆధునిక వుత్పత్తివిధానమూ దానితోబాటుగా బూర్జువా శ్రామికవర్గాలమధ్య వైరుధ్యమూ, అప్పుడప్పుడే పెరిగేరోజులలో ఇట్టిదృక్పథం వుండటం కాలానుగుణ్యంగానే కల్గింది. కాని అన్నిటికంటే ఎక్కువగా ఆతని దృష్టిని ఆకట్టినది సమాజంలో అత్యధిక సంఖ్యాకమై అత్యధికదరిద్రమైనట్టి

వర్గంయొక్క స్థితి అని సెయింట్ సైమన్ తన సిద్ధాంతాలలో ఎక్కువగా నొక్కినొక్కి చెప్పినవిషయం.

తన 'జినీవా లేఖ'లలో సెయింట్ సైమన్ "మనుష్యు లందరూ పనిజేయాలి" అన్న కర్తవ్యప్రబోధాన్ని గావించాడు. ఈవుత్తరాలు వ్రాసేనాటికే ఈతనికి భయానకపరిపాలనం అంటే ఆస్థిరహితులగు పేదప్రజానీకంయొక్క పరిపాలనయని తెలుసును. "మీ స్నేహితులకు ఫ్రాంసులో అధికారంవచ్చేసరికి ఏమిచేసారో చూడండి; వారు కరువును తెచ్చిపెట్టారు" అని ఆతడు అంటాడు. ఈవిప్లవాన్ని ఒక వర్గపోరాటంగా, అందులోనూ ప్రభువర్గానికీ బూర్జువావర్గానికే గాక ప్రభువర్గము బూర్జువావర్గాలకూ ఆస్థిరహితులగు ప్రజాసామాన్యమునకూ మధ్య వర్గపోరాటంగా, 1802 లోనే గుర్తించటం అనన్యసామాన్యప్రతిభావిశేషమే. రాజకీయాలంటే వుత్పత్తి విధానంయొక్క సైన్సుఅని 1816 లోనే అతడు చెప్పాడు; రాజకీయాలు ఆర్థికవ్యవహారాలలో పూర్తిగా మిళితమైపోతాయని ముందుగానే తెల్పాడు. ఆర్థికపరిస్థితులే రాజకీయపరిస్థితులకు మూలం అని చెప్పటకిది అంకురం; కాని ఇంతకన్నసూటిగా ఆతడుచెప్పినది, మనుష్యులపై రాజకీయ పరిపాలన తొలగిపోయి, వస్తువులనిర్వహణ, ఉత్పత్తిక్రమమును క్రమరీతిలో నడిపించటం అనేసిద్ధాంతం; అనగా, ఈ మధ్య పెద్ద గాలిదుమారాన్ని లేపిన సిద్ధాంతమగు "రాజ్యాంగ యంత్రం రద్దుగావించబడునని" ఆతడు స్పష్టంజేసాడు.

ఈతని సమకాలీనులపై సెయింట్ సైమన్ ఆధిక్యతను తెల్పుట కింకొక వుదాహరణ చూపవచ్చును. ఐరోపాలో

సంపదాభివృద్ధి జరగాలంటే, శాంతి సౌఖ్యము లేర్పడాలంటే, ప్రథమంలో ఫ్రాంసు ఇంగ్లాండులమధ్య, పిమ్మట ఈ ఉభయ దేశాలు, జర్మనీకిమధ్య మైత్రి ఏర్పడాలని, 1814 లోనే, మిత్రమండలి పారిస్ పట్టణంలో ప్రవేశించిన కొద్ది దినాలకే ఈతడు ప్రతిపాదించాడు; వందరోజుల యుద్ధకాలంలో* 1815 లో మరల ఇంకొకసారి ఈతడీ విషయాన్నే ప్రతిపాదించాడు. వాటర్లూ విజయులతో మైత్రి నెరపాలని 1815 లో ఫ్రెంచి వారికి ప్రబోధించాడంటే, ఆతని చారిత్రిక మార్గదృష్టి, సాహసము ఒకదానిని మించుతూ ఒకటి ఎంతగావున్నవో తెలియవచ్చును.

తర్వాతవచ్చిన సోషలిస్టులందరి భావాలలోనూ దొర్లిన, పూర్తిగా ఆర్థికసంబంధములు కానట్టి విషయాలన్నీ బీజరూపంలో సెయింట్ సైమన్ సిద్ధాంతాలలో వున్నవి. ఈ విధంగా సెయింట్ సైమన్‌కు విజ్ఞానఖనికివుండే విశాల దృక్పథంవుంటే, ఫొరియర్‌లో మరొక విశేషం జూస్తాము. పూర్తిగా ఫ్రెంచి జాతీయమూ అయినప్పటికీ అతినిశితమూ అగు

* 1 వ నెపోలియన్ సాగించిన జైత్రయాత్రలు చివరకు విఫలమైనవి. బూర్జువా ఇంగ్లాండు, జమీందారీ రష్యాల నాయకత్వాన, దాదాపు యూరోపియను దేశాలన్నీ ఏకమై ఫ్రాంసు నెదిరించినది. 1814 లో ఈ మిత్రమండలి సైన్యాలు పారిస్ పట్టణంలో ప్రవేశించినవి. నెపోలియన్ రాజ్య పరిత్యాగంజేసాడు. 1815 లో అతడు తిరిగివచ్చి తన ఆధిపత్యాన్ని నెలకొల్ప ప్రయత్నించాడు. మిత్రమండలితో తిరిగి యుద్ధం ("వందరోజులయుద్ధం") ప్రారంభమయినది. కాని వాటర్లూ యుద్ధంలో నెపోలియన్ పూర్తిగా ఓడిపోయి మిత్రమండలి వశమైనాడు. సెయింట్ హెలీనాద్వీపమునకు ప్రవాసమంపబడి, చివరకాతడక్కడనే చనిపోయాడు. (అనువాదకుడు)

పరిహాసయుత విమర్శనాకళ ఫోరియర్ సొమ్ము. ఆనాటి సామాజిక పరిస్థితులను అతినిశితంగా ఈతడు విమర్శిస్తాడు. బూర్జువా వర్గంయొక్క మాటలను-విప్లవానికి పూర్వంవున్న డాబుసరి బూర్జువా జ్యోతిష్కులయొక్క విప్లవానంతరం వచ్చిన బూర్జువా స్తోత్రపాఠముయొక్క, మాటలను - ఫోరియర్ పట్టుకొన్నాడు. హేతువాదపాలితమగు సమాజాన్నిగూర్చి, విశ్వమానవ సౌఖ్యాన్ని నెలకొల్పే నాగరికతనుగూర్చి, మానవుసియొక్క అనంత పరిపూర్ణతను గూర్చి ప్రబోధయుగంనాటి తత్వవేత్తలు గావించిన ఆడంబరపు వాగ్దానాలతో పోల్చి చూపుతూ ఈ బూర్జువా ప్రపంచపు భౌతికదారిద్ర్యాన్ని నిర్దాక్షిణ్యంగా బట్టబయలు చేసాడు. ఎక్కడజూచినా, తీయని కబుర్లు వాస్తవంలో ఎట్లు విషాదపరిస్థితులుగా పరిణమించినవో, సమకాలీన బూర్జువా భావుకు లుపయోగించిన అలంకార భూయిష్టమగు భాషలోనేచూపుతూ, ఈపెద్దపెద్ద కబుర్ల గంద్రగోళాన్ని నిరర్థకతను, బూటకాన్ని తీక్ష్ణమైన వ్యంగ్య భాషలో పరిహసించాడు.

ఫోరియర్ కేవలం విమర్శకుడేకాదు; ఉరుకులెత్తే పరిహాసం ఆతనిని వుత్తమవ్యంగ్యరచయితగా జేసినది. నిజానికాతడు అన్నికాలముల అత్యుత్తమ వ్యంగ్యరచయితలలో ఒకడు. ఆతడు తన సిద్ధహస్తముతో, ఎంతో వినోదకరంగా, విప్లవ అపజయానంతరం బయలుదేరిన మోసములను, ఆ కాలపు ఫ్రెంచివర్తకులాడే బేరసారముల దృష్టిని, నేర్పుతో చూపించాడు. బూర్జువావర్గంలో స్త్రీ పురుషులమధ్యవుండే సంబంధాలరూపాన్ని, స్త్రీకి ఆ సమాజంలోవుండే స్థానాన్ని

గూర్చి ఆతని ప్రదర్శనం మరీఅద్భుతం. ఒకానొకసమాజంలో వుండే సంస్కారము లెవెల్‌ను కొలవవలెనంటే స్త్రీలకుండే స్వాతంత్ర్యాన్ని, బంధవిమోచనమును కొలబద్దగా తీసుకో వచ్చునని చెప్పుట కాతడే ప్రథముడు. కాని సమాజచరిత్రను గూర్చిన దృక్పథంలోనే ఫొరియర్ మహత్వం స్పష్టంగా గోచరిస్తుంది. సమాజంయొక్క భూతచరిత్రనంతా ఆతడు అభివృద్ధి యొక్క నాల్గుదశలుగా విభజించాడు. మొదటిది ఆటవికదశ; రెండవది అనాగరికదశ; మూడవది పితృస్వామిక సమాజదశ; నాల్గవది, ఇప్పటి బూర్జువా సమాజముతో సరిపోవు నాగరిక దశ." అనాగరికదశలో సామాన్యరూపంలో ఆచరింపబడే దుర్నీతి యంతా నాగరికదశలో పెరిగి పెద్దదై, అగమ్యమగు, కపటభూయిష్టమగు జీవనవిధానంగా పరిణమించుతుంది" అని అంటాడు; ఎల్లప్పుడూ నాగరికత, దానివల్లనే ఉద్భవిస్తూ, అవి అతిక్రమించుటకు అసాధ్యమైనటువంటి వైరుధ్యాలవల్ల ఒక 'విషమచక్రం'లో తిరుగుతూవుంటుంది; అందువల్ల ఇది ఏ గమ్యస్థానాన్ని జేరదలుస్తుందో లేకయే గమ్యస్థానాన్ని జేరదలుస్తున్నట్లు కన్పిస్తుందో, దానికి పూర్తిగా వ్యతిరేకఫలితాలను పొందుతూవుంటుంది అని ఆతడు చూపుతాడు. కాబట్టి, ఉదాహరణకు, "నాగరికదశలో, అమితసంపదలనుండియే దారిద్ర్యం జనిస్తుంది." తన సమకాలీనుడగు హెగెల్‌వలెనే ఫొరియర్‌కూడా అతినేర్పుతో గతితార్కిక వాదాన్ని వుపయోగించాడు. మానవుని అనంత పరిపూర్ణతను ఖండిస్తూ, ప్రతి చారిత్రికదశలోనూ ఒక ఆరోహణక్రమమూ ఒక అవరోహణక్రమమూ వున్నదని, ఈ గతితార్కికవాద

దృష్ట్యా ఈతడు రుజువుచేశాడు. మానవజాతి భవిష్యత్తును కూడా ఈతడీ దృక్పథంనుండే పరీక్షించాడు: భూమి చివరకు నాశనంగాకతప్పదని ప్రకృతిశాస్త్రంలో నూతనసిద్ధాంత ప్రతిపాదనను జేసిన 'కాంటు' వలెనే, మానవజాతి అఖరుకు నాశనంకాకతప్పదని చరిత్రను గూర్చిన దృక్పథంలో నూతన సిద్ధాంతాన్ని ఫొరియర్ ప్రతిపాదించాడు.

విప్లవం ఫ్రాంసుదేశాన్ని మూలమూలలకూ ఊపివేస్తూ వుంటే, ఇంగ్లాండులో కూడా అంత బ్రహ్మాండమైనది అగు విప్లవం నిశ్శబ్దంగా సాగుతూ వచ్చింది. ఆవిరిశక్తి, పనిముట్ల ఉత్పత్తి యంత్రములు కనిపెట్టబడినవి. వీటి మూలకంగా సాధారణ వుత్పత్తివిధానం భారీయంత్రోత్పత్తిగా మారింది. దీనితో బూర్జువా సమాజంయొక్క పునాదియంతా పూర్తిగా మారిపోయింది. ఇంతవరకూ తాబేలు నడకలో సాగే వుత్పత్తిక్రమంలో తుపాను సదృశమగు పరుగు బయలు దేరింది. పెద్ద కాపిటలిస్టులు, ఆస్తిరహితులగు కార్మికులు అనే రెండు వర్గాలక్రింద సమాజం చీలిపోవటం త్వరితమైనది. ఈ రెండు వర్గాలకూ మధ్య, పూర్వం నిశ్చలంగావుండే మధ్యతరగతి స్థానే, సమాజంలో కెల్లా ఎక్కువగా ఊగిసలాడుచూ, అస్థిరమగు జీవనమును గల శిల్పులు, చిన్న దుకాణదారుల సమూహం ఏర్పడి, బహు ఒడుదుడుకు జీవనాన్ని గడుప ప్రారంభమైనది. నూతన వుత్పత్తి విధానం ఇంకా ఊర్ధ్వగతి గల ప్రారంభదశలోనే వున్నది; ఆనాటి పరిస్థితులలో అది ఒక్కటే సాధ్యమైన వుత్పత్తివిధానంగా, స్వాభావిక వుత్పత్తి విధానంగా వున్నది. అయినప్పటికీ, ఈ వుత్పత్తి

విధానంవల్ల ఆకాలంలో కూడా దారుణమగు పరిస్థితులేర్పడి వెంటనే అవి రద్దుకావలసిన అవసరం ఏర్పడింది. పెద్ద పెద్ద పట్టణాలలో, మురికిప్రదేశాలలో ఇళ్ళు వాకిళ్ళు లేని ప్రజలు గుంపులుగుంపులుగా జేరటం, అభిజాతము, పెద్దలయెడ విధేయత, కుటుంబమర్యాద, వీటి యన్నిటివల్ల ఏర్పడే ఆచార సిద్ధమగు బంధములు విచ్ఛిన్నంఅగుట; విపరీతంగా కష్టం చేయించటం, ముఖ్యంగా స్త్రీలు, బాలురచే ఎక్కువపని చేయించటం నానాటికీ వృద్ధిగావటం; గ్రామాలనుండి పట్ట ణాలకు రావటంవల్లనూ, వ్యవసాయంనుంచి పరిశ్రమలకు మారటంవల్లను, నిలకడగల జీవితంనుండి అస్థిరమగు, ఒడు దుడుకులుగల జీవితమునకు రావటము; వాటి యన్నిటి మూల కంగా, ఒక్కసారిగా క్రొత్తపరిస్థితులలో నివసించి రావలసి యుండుటచే కార్మికవర్గంలో అవినీతి వ్యాపించటం; ఇట్టి సామాజిక దురన్యాయములు ఏర్పడినవి ఇట్టి తరుణంలోనే 29 యేండ్ల యువకుడొకడు సంఘసంస్కర్తగా అవతరించాడు. ఈతని స్వభావం దాదాపు శిశు స్వభావమంత స్వచ్ఛము; కాని అపూర్వమగు నాయకత్వ లక్షణాలు ఈతనిలో మూర్తీ భవించి వున్నవి. ఈతడే రాబర్టుఓవెన్. మానవునిశీలం ఒక వైపున, ఆనువంశికముగా ఏర్పడునదనీ, మరొక వైపున, ఆతని జీవితంపై ముఖ్యంగా తరుణవయస్సులో ఆతని జీవితంపై పరిసరములు కల్గజేయు ప్రభావంవల్ల ఏర్పడునదనీ చెప్పిన ఫ్రెంచిభౌతికవాదుల వుపదేశముల నీతడు గ్రహించాడు. ఆనాటివారు పారిశ్రామిక విప్లవంలో గంద్రగోళమును, అరాజకమునూ మాత్రమే చూసి, ఎవరి స్వలాభమును వారు

చూసుకుంటూవుంటే, ఓవెన్ మాత్రం తన అభీష్టసిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టడంద్వారా ఈఅరాజకమునుండే శ్రమజీవితమును సృష్టించవచ్చునని తలచాడు. లోగడనే, మాంఛెష్టరులో, 500 మంది కార్మికులున్న ఫాక్టరీలో మేనేజరుగావుండి తన నూత్నయత్నమును జయప్రదంగా అమలుజరిపాడు. ఆన 1800 నుండి 1829 వరకూ స్కాట్లండులోని న్యూలానార్కు బట్టలమిల్లుకు మేనేజింగు భాగస్వామిగావుండి ఇంకా ఎక్కువ స్వేచ్ఛతో పైపద్ధతులలోనే మిల్లును జయప్రదంగా నడిపించాడు. ఇందువల్ల ఐరోపాయంతటా అతనిఖ్యాతి విస్తరించినది. న్యూలానార్కు గ్రామజనాభాను క్రమంగా 2500 కు పెంచాడు. మొదట్లో నానాగోత్రీభ్యః గావుండి, పతితులైనవారి నందరినీ కూడదీసి ఒక మోడల్ కాలనీగా తయారుజేసాడు; ఆకాలనీలో, తాగుడు, పోలీసులు, మేజస్ట్రీట్లు, దావాలు, అనాధశరణాలయములు, దానధర్మాల అవుసరం లేనేలేదు. కాలనీసభ్యులు మానవమాత్రులుగా జీవించుటకనువగు పరిస్థితులను కల్గించుటద్వారాను, ముఖ్యంగా భావిపౌరులగు బాలుర విషయంలో ప్రత్యేకశ్రద్ధ తీసికొనుటద్వారాను ఈతడీకాలనీని జయప్రదంగా నిర్వహించగల్గాడు. శిశుపాఠశాలలను కనిపెట్టింది ఈతడే. ప్రథమంగా స్థాపించినదీ ఈతడే; రెండుఏండ్లుదాటిన బిడ్డలందరూ ఈబడికివచ్చి ఎంతగా వినోదించేవారంటే తిరిగి వీరిని ఇండ్లకు పంపడం బ్రహ్మప్రళయ మౌతూవుండేది. తన పోటీదార్లు కార్మికులచే రోజుకు 13, 14 గంటలు పని చేయిస్తూవుంటే, ఈతడు న్యూలానార్కులో 10½ గంటలు మాత్రమే పని చేయించేవాడు.

పత్తిదారకక ఫాక్టరీ 4 నెలలుమూతబడితే ఈ పని లేనికాలానికి కూడా కార్మికులకు పూర్తి జీతాలిచ్చాడు. ఇంతఖర్చు జరుగుచున్నా ఫ్యాక్టరీవిలువ రెట్టింపు పెరిగింది, చివరవరకూ ఫ్యాక్టరీ యజమానులకు లాభాలు వస్తూనేవున్నవి.

ఇవన్నీ జరుగుచున్నప్పటికీ ఓవెన్‌కు సంతృప్తికల్గలేదు. తన కార్మికుల కెన్ని సౌకర్యాలను కల్గించినా, మానవులుగా వీరు జీవించివుండుటకై ఇవి చాలి వుండలేదని భావించాడు, "ఈ ప్రజలు బానిసలుగానే వుంటున్నారు" అని ఆలోచిస్తూ వుండేవాడు. ఇతరులతో పోల్చి చూచినప్పుడు వీ రెక్కువ సౌకర్యాలను పొందుచున్నా, మానసిక, నైతికాభివృద్ధులను పొందుటకు గాని, స్వేచ్ఛాస్వతంత్రముల ననుభవించుటకు గాని ఈ సౌకర్యాలు చాలియుండలేదని ఈతడు భావించాడు. "అర్ధశతాబ్దానికి పూర్వం 6,00,000 మంది కార్మికులు ఉత్పత్తి జేసే సంపదలన్నిటినీ నేడు 2500 మంది కార్మికులే జేస్తున్నారు. దీనినిజూచి నాలో నేననుకున్నాను: 'నేడు 2500 మంది కార్మికులు వినియోగపర్చిన సంపదకు, లోగడ 6,00,000 మంది కార్మికులు వినియోగపర్చిన సంపదకు మధ్యగల తేడా ఏమైనది ?' అని. దీనికి జవాబు సులభమే. ఫాక్టరీ యజమానులకు పెట్టుబడిపై వచ్చిన 5% వడ్డీ; ఇదేగాక దీనికి తోడుగా వచ్చిన 3,00,000 పౌండ్లలాభం ఇదే. న్యూలానార్కు ఫాక్టరీకే ఈ సూత్రం వర్తిస్తూవుంటే ఇంగ్లాండులోని ఇతర ఫాక్టరీల విషయంలో ఇదిమరింత సత్యంగాదా? "యంత్రముల ద్వారా వుత్పత్తి అయ్యే నూతన సంపదలేగనుక లేకపోతే, నెపోలియనును పదచ్యుతుని జేయుటకు సాగించిన యుద్ధాలుగాని, సమా

జంలో వుండే కులీనుల భోగభాగ్యాలుగాని వుండేవేకావు. ఈ నూతనశక్తి యంతా కార్మికుల సృష్టియే.'' * కాబట్టి ఫలితం వారికే చెందాలి. ఇంతవరకూ ఈ బ్రహ్మాండమగు వుత్పత్తి శక్తులు వ్యక్తుల లాభాలకొరకై వుంటూవున్నవి; ప్రజాసామాన్యాన్ని బంధములలో వుంచుటకై ఉపయోగపడుచున్నవి. కాని నేడు, ఓవెన్ దృష్టిలో, ఇవి సమాజాన్ని నూతన పద్ధతులపై పునర్నిర్మిస్తానికి పునాదులుగా వుపయోగపడగల్గినవిగా కన్పించినవి. ప్రజలందరి సమిష్టి ఆస్తిగావుంటూ, అందరికీ సౌఖ్యాలను సమకూర్చ వుద్దేశింపబడినట్లుగా కన్పించినవి.

ఈ విధంగా పూర్తిగా వ్యాపారాలోచనలవల్ల కల్గిన వ్యవహారదృష్టిలో ఓవెన్ కమ్యూనిజం పుట్టింది. ఈతనికీ ప్రాక్టికల్ దృష్టి చివరిదాకా వున్నది. ఐర్లాండులో దుస్థితి సంభవిస్తే కమ్యూనిష్టుకాలనీలను ఏర్పాటుచేసిదానినంత మొందించవచ్చునని 1823లో ఓవెన్ ఒక స్కీమును వేసాడు. దానిలో ఆరంభంలో ఎంత ఖర్చుఅవుతుంది? సాలుసరి ఖర్చు ఎంత? ఆదాయమెంత? మున్నగు పూర్తి అంచనాలన్నీ వున్నవి. అదే విధంగా, క్రింద పైన, ప్రక్కన, ఏ దిక్కునుండి చూచినా సర్వాంగసుందరంగా కన్పించే టెక్నికల్ వివరాలన్నీ ఇందులో వున్నవి. ఇది ఈతని వ్యవహారజ్ఞానాన్ని దెలియజేస్తున్నది. ఒక్కసారి గనుక ఈతని సంఘసంస్కరణ స్కీమును

* "భావము, ఆచరణలలో వచ్చిన విప్లవం" అనే గ్రంథంనుండి. ఈ గ్రంథం "విప్లవ ప్రజాతంత్రవాదులకు, కమ్యూనిస్టులకు, సోషలిస్టులకు వుద్దేశింపబడి వ్రాయబడిన విజ్ఞాపన. ఇది 1848 ఫ్రెంచి తాత్కాలిక ప్రభుత్వానికీ "విక్టోరియారాణికి, బాధ్యతగల ఆమె సలహాదారులకూ'' పంపబడినది.

(ఎంగెల్సుఫరా)

ఆమోదిస్తే ప్రవీణుని దృష్ట్యా ఈతని స్కీము సర్వాంగసుంద రంగా, ఎక్కడా ఏలోటూ లేనట్టిదిగా కన్పించగలదు.

ఈతడు కమ్యూనిజంవైపు మగలటంతో ఈతని జీవితం మెలిదిరిగింది. కేవలందయానిధిగా వున్నంతకాలం ఈతడు విప రీతసంపదలు సంపాదిస్తూ వుండేవాడు: పొగడ్తలు, గౌరవం, కీర్తిప్రతిష్ఠలు ఈతనిసొమ్ములు: ఐరోపాఅంతటా ఈతని పలుకు బడి విస్తరించింది! అతని వర్గంవారేగాక, రాజ్యాంగ వేత్తలు రాజులు ఈతని సలహాల నెంతగానో మన్నించేవారు. కాని ఈతడెప్పుడైతే కమ్యూనిజమును వెంటబెట్టుకొని బయలుదే రాడో అప్పుడు వెంటనే పరిస్థితి పూర్తిగా మారింది. సంఘ సంస్కరణకు ఆతనికి మూడు పెద్దప్రతిబంధకములు కన్పించినవి. స్వంతఆస్థి; మతం; ప్రస్తుతరూపంలోవున్న వివాహం: ఇవి ఈమూడు ప్రతిబంధకములు. నాటినెదుర్కొంటే తనకున్న గతి ఏమిటో ఆతడెరుగును. ఉన్నతసంఘమునుండి తాను బహిష్క రింపబడగలడనీ, సంఘములో తన్నకున్నస్థానం భ్రష్టంకాగల దనీ ఆతడెరుగును. కాని ఏమిసంభవించినా ఆతడు వాటిని ఎదు ర్కొంటానికి వెనుదీయలేదు. వెంటనే ఆతడనుకున్నంతపనీ జరి గింది. ఉన్నతసమాజం ఆతనిని వెలివేసింది: వార్తాపత్రికలు ఆత నిని బహిష్కరించినవి: తన సర్వసంపదలనూఒడ్డి అమెరికాలో సాగింపబూనిన కమ్యూనిష్టు పరిశోధనస్నీ విఫలమైనవి :అందు మూలకంగా ఆతడు తన సర్వస్వమునూ కోల్పోయినాడు. ఇట్టి పరిస్థితులలో ఆతడు కార్మికవర్గంవైపు తిరిగి వారిలో లీనమై పోయి, సుమారు 30 సంవత్సరములు పనిజేశాడు. ఇంగ్లాండులో ప్రారంభింపబడిన ప్రతిసంఘసంస్కరణోద్యమంతోనూ, కార్మి

కుల స్థితిలోకల్గిన అభివృద్ధితోనూ రాబర్టు ఓవెన్‌కు సంబంధ మున్నది. ఈతడు 5 ఏండ్లు తీవ్రకృషిని గావించుట ఫలితంగా, ఫాక్టరీలలో స్త్రీలు, బాలురు పనిచేయవలసిన గంటల పరిమితిని నిర్ణయిస్తూ 1819లో ఒకచట్టం జారీకాబడింది. ఇంగ్లాండులోవున్న ట్రేడ్‌యూనియన్లు అన్ని కలిసి ఒకేగొప్ప కేంద్ర ట్రేడ్‌యూనియన్‌గా ఏర్పడుటకై జరిగిన ప్రథమ సమావేశమునకు ఈతడు అధ్యక్షత వహించాడు. *సమాజాన్ని పూర్తిగా కమ్యూనిస్టు పద్ధతులపై నిర్మించుటకై మొదటి మెట్టుగా, ఒకవైపున సహకార సంఘాలను—ఉత్పత్తిదారుల కొనుగోలుదారుల సహకారసంఘాలను—నిర్మించాడు; వీటి స్థాపనమూలకంగా వ్యాపారులుగాని, పారిశ్రామిక యజమానులుగాని లేకుండానే వ్యవహారం జరుపుకోవచ్చుననేది రూఢిఅయినది. రెండోవైపున, కార్మికబజారులను నెలకొల్పాడు. ఈబజారులలో కార్మికులు వుత్పత్తిగావించిన వస్తువుల బేరసారాలు సాగేవి; శ్రమ గంటను యూనిటుగా పెట్టుకొన్న శ్రమనోట్లు ఈవస్తువులమారకానికై వుపయోగించ బడినవి (Labour-notes with the labour-hour as unit) ఈ ప్రయోగాలు తప్పక విఫలమై తీరుతాయి; కాని తర్వాతకాలంలో ప్రౌధన్ నిర్మించబూనుకొన్న మారకపు బాంకుకుయిది పూర్వ

---

* 1833 అక్టోబరులో ట్రేడ్‌యూనియన్ ప్రతినిధుల సమావేశం జరిగింది. ఓవెన్ దానికి అధ్యక్షత వహించాడు. దేశం నలుమూలలావున్న వివిధ ట్రేడ్‌యూనియన్లను కలుపవలెనని ఆ సమావేశం తీర్మానించిది. ఇట్లు బ్రిటిషు ట్రేడ్‌యూనియన్లనన్నిటినీ కల్పి ఏర్పాటు జేసిన ప్రథమ సంస్థయే The Great National Consolidated Trade Union 1834 ఆఖరులో ఇది రద్దుకాబడింది. (అనువాదకుడు.)

రూపం * దీనికీ ప్రౌధన్ నిర్మింపబూనుకొన్న మారకపు బాంకుకూ వున్న భేదమేమిటంటె, ప్రౌధన్ బాంకు సమాజంలోవున్న అన్నిచెడుగులకూ దివ్యౌషధంగా తలపెట్టబడుతే ఓవెన్ కార్మికబజారు సమాజంయొక్క తీవ్రసంస్కరణకు ఒక మెట్టుగామాత్రమే తలపెట్టబడినది.

ఈ యుటోపియన్ల దృక్పథం 19 వ శతాబ్దపు యూరోపియన్ సోషలిస్టుల భావాలపై చాలాకాలం ప్రభావం కలిగివుండేది; కొంతవరకూ ఇప్పటికీ అట్టిప్రభావాన్ని కలిగియే వున్నది. మొన్న మొన్నటివరకూ ఫ్రెంచి, ఇంగ్లీషు సోషలిస్టులు ఈయుటోపియన్ల దృక్పథవిధానానికి జోహారులర్పిస్తూ వుండేవారు; వీట్లింగుతోసహా, వెనుకటి జర్మను కమ్యూనిస్టులందరూ ఈతరగతివారే. వీరికి సోషలిజం అంటే శాశ్వత

* ఫ్రెంచి పెటీ బూర్జువా యుటోపియన్లలో ఒక ముఖ్యుడు ప్రౌధన్ (1809-65) ఈతడు అరాజకవాదం (anarchism) సృష్టికర్త. ఈతనిదృష్టిలో, ఆనాటికింకా పెరుగుతూవున్న కాపిటలిజములోని చెడుగుల కన్నిటికీ పరిష్కారమార్గం సోషలిజంగా కన్పించలేదు; సోషలిజం స్థాపనకొరకై జరిగే శ్రామికవర్గ విప్లవమూ కాదు. చిన్నచిన్న ఆస్తులను కలిగివుండి, కూలీలను దోచుకొనకుండా, స్వతంత్రంగా వుత్పత్తిని సాగించే సామాన్య రైతులుండే వ్యవస్థకు మళ్ళటంద్వారానే కాపిటలిజంవల్ల బయలుదేరిన చెడుగులు అంతరించగలవని ఈతని సిద్ధాంతం. ఈసిద్ధాంతానికి అనుగుణ్యంగానే ఈతని మారకపు బాంకు ఉద్దేశింపబడినది. సరుకుల నుత్పత్తి చేయుటకై వినియోగింపబడిన శ్రమ మొత్తమునుబట్టి ఈబాంకులద్వారా ఈ చిన్న "వుత్పత్తిదారుల" సరుకులు పరస్పరం మారుతూవుంటాయి. ("సమానశ్రమతో సమానశ్రమ మారుట") ఈవిధంగానే వారిని దుస్థితినుండి, బీదరికంనుండి తొలగించవచ్చును; వారి స్వల్పవుత్పత్తినీ, స్వల్ప స్వంత ఆస్తినీ కాపాడవచ్చును. ఈ బాంకులే, కార్మికులను "చిన్న వుత్పత్తిదారులను"గా మార్చుట ద్వారా కాపిటలిస్టులనుండి రక్షించవచ్చును; అని ప్రౌధన్ సిద్ధాంతం. (అనువాదకుడు)

సత్యము; హేతువాదము; న్యాయము; ఇవి తమ స్వశక్తివల్లనే ప్రపంచాన్ని అధిష్టించగలవు; ఈశాశ్వతసత్యమనేది కాలమునకూ, దేశమునకూ (Time & space) అతీతమైనది కాబట్టీ, మానవ చారిత్రిక పరిణామమునకు అతీతమైనది కాబట్టీ ఎప్పుడు, ఎక్కడ కనిపెట్టబడినా కనిపెట్టబడవచ్చును. అది భాన్సు మాత్రమే. కాని ఇదేసమయంలో ఒక్కొక్క మతానికి ఒక్కొక్క విధంగా ఈ శాశ్వత సత్యమూ, హేతువాదమూ, న్యాయమూ కన్పించగలవు; వారివారి విషయ పరిగ్రహణ శక్తినిబట్టీ, వారివారి జీవన పరిస్థితులనుబట్టీ, వారి వారి జ్ఞానము ధీశక్తులబట్టీ, వారివారి స్వంత శాశ్వత సత్యములూ, హేతువాదములూ, న్యాయసిద్ధాంతములూ ఏర్పడుతూవుంటాయి; వీటియన్నిటి మధ్యా తప్పనిసరిగా సంఘర్షణ ఏర్పడుతూ వుంటుంది; కాబట్టి ఒకదానినొకటి నలిపివేయటంలోనే ఈ సంఘర్షణ పరిష్కారమౌతుంది. ఇదీ వీరి భావం. దీని ఫలితంగా ఏర్పడేది, ఇంతవరకూ ఇంగ్లాండు ఫ్రాంసుల లోని సోషలిస్టుభావాలలో కన్పించేటటువంటి మిడి మిడి జ్ఞాన భూయిష్టమైన సామాన్య సోషలిస్టు సిద్ధాంతం. ఈ సిద్ధాంతంలో భిన్నభిన్న దృక్పథాలు, భిన్నభిన్న విమర్శనా దృష్టులు, భిన్నభిన్న ఆర్థిక సిద్ధాంతాలు, భావిసమాజం రూపురేఖలగూర్చిన భిన్నభిన్న అభిప్రాయాలు కలగాపులగంగా కలిసివుంటాయి. ఏటిలో దొర్లే రాళ్ళు అంచులు నునుపుదేలినట్లే, ఈ సిద్ధాంతాల రాద్ధాంతాల్లో ఆ సిద్ధాంతాలలోని తీక్ష్ణత తరిగి, చులకనయగు ఒక మిశ్రమ సిద్ధాంతంగా తయారౌతుంది. కాబట్టి సోషలిజమును శాస్త్రీయంగా జేయుటకై ముందు దానిని వాస్తవికమగు పునాదులపై నిలబెట్టాలి.

# II

ఈ లోపుగా, 18 వ శాతాబ్దపు ఫ్రెంచి తత్వశాస్త్రంతో బాటుగాను, దానితర్వాతకూడ ఆధునిక జర్మను తత్వశాస్త్రం అభివృద్ధి అయినది. ఇది హెగెల్‌లో పరిపూర్ణత నొందినది. ఈ ఆధునిక జర్మన్ తత్వశాస్త్రంలో వున్న గొప్పతనమేమిటంటే, అది తిరిగి గతితార్కికవాదాన్ని తన తత్వవిచారణలో అవలంబించినది. పూర్వపు గ్రీకు తత్వ వేత్తలందరూ జన్మతః గతితార్కికవాదులే. వారిలోకల్లా కూలంకష ప్రజ్ఞగల అరిస్టోటల్ గతితార్కిక క్రమమును క్షుణ్ణంగా అనుశీలన గావించాడు. కాని ఈ నూతన జర్మన్ తత్వశాస్త్రం, డెస్కార్టిస్, స్పినోజా, మున్నగు అఖండ ప్రతిభగల గతితార్కికవాదులను కొందరిని మినహాయించితే తక్కినవారందరి సిద్ధాంతములు పూర్వపు గ్రీకు గతితార్కికపద్ధతికి భిన్నమైనవి. ముఖ్యంగా యింగ్లీషు పలుకుబడిక్రిందకువచ్చి చివరకు ఆధ్యాత్మిక భావమని పిలవబడే అతి పెడసరమగు పద్ధతిక్రింద దాదాపుగా తయారైనది; 18 వ శతాబ్దపు ఫ్రెంచి తత్వశాస్త్రజ్ఞులు దీని ప్రభావంక్రిందకు వచ్చారు. కనీసం వారి ప్రత్యేకపు తత్వశాస్త్ర గ్రంధాలైనా దీని ప్రభావంక్రిందనే వ్రాయబడినవి. కాని తత్వశాస్త్రంకాని ఇతరరంగాలలో ఫ్రెంచి తత్వశాస్త్రజ్ఞులు అద్భుతమగు గతితార్కికవాదకౌశల్యమును ప్రదర్శించారు. డిడెరాట్ పండితునియొక్క "రామియో మేనల్లుడు" అన్న గ్రంధాన్నిగాని, రూసోయొక్క

"మానవులలో అసమానత్వమునకు మూలకారణము"ను గూర్చిన వ్యాసమునుగాని చూస్తే యీ విషయం తెలుస్తుంది. ఈ రెండుమతాల పద్ధతులలోని ప్రధాన లక్షణములనుగూర్చి సూక్ష్మంగా ఈక్రింద ప్రస్తావిస్తాను.

ఈవిశాలప్రపంచంలో వస్తువులమధ్య, వ్యక్తులమధ్య అగణితమగు సంబంధాలు, పరస్పర సంబంధాలు ఏర్పడు తూనే ఉంటాయి. ఈసంబంధాల, పరస్పర సంబంధాలలోను ఏది; ఎక్కడ, ఎప్పుడు, ఉన్నస్థితిలోనే వుండదు. ప్రతిదీ చలనం కలిగియుంటుంది; మారుతుంది; రూపమును ఏర్పరచు కొంటుంది; రూపవిసర్జన గావిస్తుంది. ఈపరిణామక్రమమే మనం ప్రకృతిని గురించిగాని, మానవచరిత్రను గురించిగాని, మానవుని ఆలోచనాక్రమమును గూర్చిగాని, ఆలోచించినచో మనకు మొట్టమొదటిగా కనిపిస్తుంది. మనకు మొట్టమొదటిగా పూర్తి చిత్రం కనిపిస్తుంది ; అందలి వివరాలు దాదాపు మరుగున పడియుంటాయి. మనదృష్టి ఏది కదుల్తోంది ఏది మారుతోంది, లేక ఏది సంయోగము నొందుచున్నది, అనే దాని కన్నా ప్రధానంగా దాని కదలికపై, దాని అవస్థాంతరముపై, దాని పరస్పరసంబంధములపై ఎక్కువగా కేంద్రీకరింపబడుతుంది. పురాతనగ్రీకు తత్వశాస్త్రం ప్రాపంచిక దృక్పథాన్ని పునాదిగా కలిగినట్టిది. అందుచే స్వాభావికమైనది; అంతేగాక స్వతహా సరియైనట్టిది, మొట్టమొదటగా యిది హిరాక్లైటస్ వల్ల ప్రతిపాదింపబడినది. ప్రతిదీ ఉన్నది, లేదు కూడా; ఎందుచేతననగా ప్రతిదీ ఎల్లప్పుడుస్రవించి పోతూవుంటుంది; సర్వదా

మార్పు చెందుతూ వుంటుంది; ప్రతిక్షణము రూపమును ఏర్పర్చుకొంటూ గతించి పోతూవుంటుంది. పురాతన గ్రీకు తత్వ శాస్త్రముయొక్క ప్రాపంచిక దృక్పధమిదే. ప్రకృతి చిత్రము మొత్తమంతటి జనరల్ స్వభావాన్ని యీ దృక్పథం సరిగా చూపెట్టినా ఆమొత్తం చిత్రంలోవుండే వివరాలను ఇది వివరించుటకు అశక్తురాలైనది; ఈ వివరాలను పూర్తిగా తెలుసు కోలేనంతకాలం, మొత్తం చిత్రాన్ని గురించిన సమగ్ర జ్ఞానం కలుగదు. ఈవివరాలను మనం తెలుసుకోవాలంటే వాటిని వాటి స్వాభావిక సంబంధాలనుండి లేక చారిత్రిక సంబంధాలనుండి విడదీయాలి. ఒక్కొక్కదానియొక్క ప్రకృతినిగూర్చి, ప్రత్యేకకారణాలనుగూర్చి ఫలితాలనుగూర్చి, యిట్టివే యితరములగు వాటినిగూర్చి పరీక్ష గావించాలి. ప్రధానంగా యీకర్తవ్యము ప్రకృతిశాస్త్రము, చరిత్ర పరిశోధనలది; యీశాస్త్రభాగాలనే ఉత్తమ గ్రీకు తత్వవేత్తలు కొన్ని ముఖ్యకారణాలవల్లనే, వెనుకకు నెట్టివేశారు; కారణమేమిటంటే యీవివరాలనుగూర్చి వారు పరీక్షచేయాలంటే ముందుగా అందుకవసరమగు వస్తుసామగ్రినంతను పోగుచేయాలి. వేటినైనా విమర్శనాదృష్టితో అనుశీలనం చేయాలన్నా తారతమ్యపరీక్ష గావించాలన్నా, లేక వర్గాలు, తరగతులు జాతులుక్రింద విభజించాలన్నా ముందుగా అందు కవసరమగు ప్రాకృతిక, చారిత్రిక సామగ్రిని పోగుచేయాలి. ప్రకృతినిగూర్చిన సరియగుపరిశీలన మొట్టమొదటగా *అలెగ్జాం

---

*క్రీస్తుకు పూర్వం 3వ శతాబ్దంతో ప్రారంభమై క్రీస్తుకు తర్వాత 3వ శతాబ్దం వరకు ఉన్న కాలాన్ని అలెగ్జాండ్రియా శకమంటారు. అకా

డ్రియా శకంలో గ్రీకులచే ప్రారంభింపబడినది; తర్వాత మధ్య యుగాలలో అరబ్బులచే మరింత అభివృద్ధి పర్చబడినది. కాని నిజమగు ప్రకృతిశాస్త్రం 15వ శతాబ్దపు పశ్చిమార్థంలో ప్రారంభమై, అప్పటినుండీ అతి శీఘ్రముగా అభివృద్ధియైనది. ప్రకృతియొక్క వేరు వేరు భాగాలను అనుశీలన గావించడం, ప్రకృతియొక్క వివిధ పోకడలను, ప్రకృతి పదార్థములను, వర్గీకరణచేయుట, పలురూపముల నొందు ప్రాణివర్గముల యొక్క అంతశ్శారీర శాస్త్రముల నభ్యసించుట — ఇవియన్నీ గత నాలుగువందల యేండ్లలోను మన జ్ఞానమును అభివృద్ధి నొందించుటకు ప్రధాన హేతువులైనవి. కాని ఈ రకమైన పరిశోధనవల్లకూడా సాధారణ వస్తువులనుగాని, ప్రకృతి గతులనుగాని, పరిశీలించేటప్పుడు, విస్తారమైన వాటి పరస్పరసంబంధాలను గమనించకుండా, విడివిడిగా పరిశీలించే అలవాటు ఏర్పడింది; ఇందువల్ల మన లక్ష్యంలోవున్న వస్తువును దాని చలనకాలంలో చూడక విశ్రాంతికాలంలో చూడటం; అవిరళంగా మార్పుచెందునట్టిదిగా గాక అచలముగాచూడటం, సజీవముగావున్నట్లుగా గాక నిర్జీవస్థితిలో వున్నట్లుగా చూడటం అలవాటైనది. ఇట్టి దృక్పథాన్ని ప్రకృతి శాస్త్రములనుండి తత్వశాస్త్రమునను గొని

---

లంలో అంతర్జాతీయ ఆర్థిక సంబంధాలలో అత్యంతప్రాముఖ్యమును వహించిన (మధ్యధరాసముద్రములో ఒక రేవుపట్టణం) అలెగ్జాండ్రియా పట్టణము నుండి యీపేరు పుట్టినది. ఈ అలెగ్జాండ్రియా శకంలో గణితశాస్త్రం (యూక్లిడ్, ఆర్కిమెడిస్ ప్రఖ్యాత గణితశాస్త్రజ్ఞులు.) భూగోళశాస్త్రం ఖగోళశాస్త్రం, శరీరశాస్త్రం మున్నగు ప్రకృతి శాస్త్రములు కొంతవరకు అభివృద్ధిచెందినవి. (అనువాదకుడు)

పోయినపుడు (బేకన్, లాకే తత్వవేత్తలు ఇందుకు వుదాహరణ) గత శతాబ్దంలో ప్రారంభమైనట్టి హ్రస్వదృష్టికీ, ఆధ్యాత్మిక చింతనకూ కారణభూతమైనది.

ఆధ్యాత్మిక చింతకులకు వస్తువులు వేరు; వాటి మానసిక బింబములు వేరు: ఇవి విడి విడియైనవి. వీటినిగూర్చి విచారించునప్పుడు ఒకదాని వెనుక ఒకటిగా, ఒక దానితో యింకొకటి సంబంధము లేకుండా విచారింపదగినది; అట్లే అచలరూపములో, ఎల్లప్పుడూ వున్నవి అన్నభావంతో విచారింప దగినవి. ఇట్టి ఆధ్యాత్మికవాదులు ఒక దానికొకటి అతుకని వ్యతిరేక భావములతో ఆలోచిస్తూవుంటారు. వారిధ్యానమార్గమంతా 'ఔను, కాదు; ఇంతకన్న ఎక్కువగా ఒకఅడుగు వేసి ముందుకు పోతే, ప్రమాదం సంభవిస్తుంది' అన్నది. వీరి దృష్టిలో, ఒక వస్తువు వుండనైనావున్నది, లేదా అసలేలేదు; ఒక వస్తువ ఒకకాలంలో ఒక రూపంలో వుండి అదేకాలంలో మరొకటిగా కూడా వుండటం అసంభవం; అయితే సత్యము, లేదా అసత్యము; ఏదో ఒకటే వీరి సిద్ధాంతం ప్రకారం వుంటుంది. ఇదే విధంగా కారణము, ఫలితము ఒకదానికొకటి వ్యతిరేకములు. ప్రథమంలో ఇట్టి ఆలోచనావిధానం సరియైనదిగానే కన్పిస్తుంది; ఎందుచేతనవగా, ఇది లోకజ్ఞానంగా కన్పిస్తుంది. నిజమే, లోకజ్ఞానమే ననుకొందాము; కాని ఈ లోకజ్ఞానంగల పెద్దమనిషి తన యింటి నాల్గు గోడలమధ్య వున్నంత కాలమే తన పరువును నిల్పుకుంటాడు గాని, వాటిని దాటి శాస్త్రపరిశోధన రంగాలలో అడుగుపెట్టాడా యిక చిత్ర విచిత్ర సాహసములన్నీ ప్రారంభ మౌతాయి. మనం ఒకవస్తువును గురించి

ఆలోచించేటప్పుడు, దాని స్వభావాన్నిబట్టి ఆఆలోచనా రంగం మారుతూవున్న సందర్భాలలో ఇట్టిఆధ్యాత్మిక దృక్పథం కొంత వరకు ఆచరణీయం, అవుసరంకూడా; కాని ఇదిఒక హద్దును దాటుసరికి అది పాక్షికదృష్టి క్రిందా అస్పష్ట పరిశీలనక్రిందా మారి, పరిష్కారసాధ్యంకాని వైరుధ్యాలలో దారి తప్పిపో తుంది. ఇట్లు జరగటం తథ్యం: కారణ మేమిటంటే, ఒక్కొక్క వస్తువును గూర్చి ఆలోచించేటప్పుడు ఈ దృక్పథం ప్రకారం ఆవస్తువుయొక్క ఇతర సంబంధాలను మర్చిపోవట మౌతుంది; వస్తువు అస్థిరత్వాన్నిగూర్చి ఆలోచించునప్పుడు దాని జనన మరణ ధర్మాలను గూర్చి గుర్తించకపోవటమౌతుంది. వస్తు వును దాని విశ్రాంతిసమయంలో చూస్తున్నప్పుడు దాని చలన మునుగూర్చి మర్చిపోవట మౌతుంది; చెట్లనొక్కొక్కటిగా చూసి అది అడివి అన్నసంగతి మర్చిపోవట మౌతుంది. ఉదాహరణకు: నిత్యజీవితంలో మనం ఒక జంతువు బ్రతికి వున్నదా లేక చనిపోయినదా అని స్పష్టంగా, రూఢిగా చెప్ప గలం. కాని దానిని సూక్ష్మంగా పరిశీలిస్తే, ఈ విషయాన్ని రూఢిగాచెప్పటం చాలావిషమమని తెలుసుకోగలం. ధర్మ శాస్త్రాధిపతులకు ఈ విషయం బాగా తెలిసినదే: తల్లి గర్భంలో వున్న శిశువును ఎప్పుడు చంపుతే అది హత్యానేరం క్రిందకు వస్తుంది అన్నది హేతుబద్ధంగా నిర్ణయించుటకు ఈ ధర్మాధి కారులందరూ తలలు బద్దలుకొట్టుకొనవలసినదే. అదేవిధంగా, సరిగ్గా ఎప్పుడు మరణం సంభవించినది చెప్పటంకూడా కష్టమే. కారణమేమిటంటే, శరీరశాస్త్రరీత్యా, మరణమనేది అకస్మా త్తుగా సంభవించేది కాదనీ, కాలక్రమేణా ఎంతోకాలంగా

ఇది పరిణమించుతూ వచ్చేదనీ తెలియగలము. ఇదేవిధంగా, ప్రతిప్రాణీ ఒకే కాలంలో అది అదిగానే వుంటుంది; అదిగా వుండదు కూడాను. ఈ వస్తువు అనుక్షణమూ బైటనుంచి పదార్థమును స్వీకరిస్తున్నది; బైటకు కొంత పదార్థమును విసర్జిస్తున్నది. ప్రతినిమేషమూ దానిలోని కొన్ని జీవకణములు నశిస్తున్నవి; కొన్ని నూతనకణములు ఏర్పడుచున్నవి; ఈ విధంగా, చివరకు దాని శరీరపదార్థమంతా పునస్థాపితమై, ఇతర అణుపదార్థములచే ఏర్పడివుంటుంది; ఇందువల్ల ప్రతిప్రాణీ ఏ సమయంలోనైనా తాను తానుగానేవుంటూ, తనకన్న భిన్నమగు మరొక వస్తువుగాకూడా వుంటుంది. మనం సూక్ష్మంగా, పరిశీలిస్తే, పరస్పర విరుద్ధశక్తులతో కూడిన ఒక శక్తియొక్క రెండు ధృవములూ, ధన, ఋణ విద్యుచ్ఛక్తుల (Positive and Negative) వలె, ఒకదాని కొకటి వ్యతిరేకములుగా వున్నా, విడదీయ వీలుకానట్లు కలిసివుంటాయి, అవి ఎంత పరస్పర వ్యతిరేకములైనను, ఒకదానిలో ఒకటి చొచ్చుకు పోతూనేవుంటాయి. ఇదే విధంగా కార్యకారణ సంబంధములు. మనం దేనిని గూర్చియైనా ప్రత్యేకంగా పరిశీలిస్తున్నప్పుడే ఒకటి కారణమనీ, ఒకటి కార్యమనీ వేరు వేరుగా కన్పిస్తాయి; కాని మొత్తం ప్రపంచానికి అన్వయించి వాటినిచూస్తే, అవి కేవలం క్రియ, అన్యోన్య క్రియలుగా (action and reaction) కన్పిస్తాయి. ఇందులో కార్యకారణములు స్థానభేదమును పొందుతూ వుంటాయి. ఇప్పుడు కారణమైనది ఇంకొకప్పుడు కార్యమౌతుంది; ఇప్పుడు కార్యమైనది ఇంకొకప్పుడు కారణమౌతుంది. కాబట్టి కార్యకారణములు స్థిరములుకావనీ, ఇప్పుడు, ఇక్కడ కారణ

మైనది, తర్వాత కార్యముగా మారగలదనీ, అదేవిధంగా ఇప్పుడు, ఇక్కడ కార్యమైనది మరల కారణం కాగలదనీ తెలియగలదు.

కాని, ఈ ఆలోచనాపద్ధతి ఆధ్యాత్మికచింతనలో ఇముడదు. వస్తువులనుగాని; వస్తువుల ప్రతిబింబములగు భావములనుగాని వాటి పరస్పరసంబంధాలనుబట్టి, వాటి క్రమమును బట్టి, వాటి చలనమునుబట్టి, వాటి జననమరణములనుబట్టి గతితార్కికవాదం చూస్తుంది. పైనజెప్పిన పరిణామక్రమమంతా గతితార్కికవాదపద్ధతి సరియైనదని రుజువుచేసేదే. ప్రకృతియే గతితార్కికవాదానికి పరీక్ష. ఈపరీక్షకు మిక్కిలి అవుసరమగు, ఉపయోగకరమగు వస్తుసామగ్రిని ఆధునిక ప్రకృతిశాస్త్రాలు సంపాదించి పెట్టినవి; ఈసంపాదన ఇంకా వృద్ధియౌతూనే వున్నది. కాబట్టి ప్రకృతి పరిణామాన్ని అనుశీలనం చేయగా, చేయగా, అది గతితార్కికపద్ధతిలో నడుస్తున్నది గాని ఆధ్యాత్మికపద్ధతిలో కాదని తెలుస్తున్నది; ఎన్నడూ మార్పుజెందనిరీతిలో, ఒకేవర్తులరేఖలో కదలుటగాక, వాస్తవమగు చారిత్రికపరిణామక్రమములో నడుస్తున్నదని స్పష్టం కాగలదు. ఈసందర్భంలో, ఆధ్యాత్మికచింతనకు చావుదెబ్బ కొట్టినవారిలో ప్రధానంగా డార్విన్‌ను గుర్తించాలి. ఈనాటి ప్రాణికోటియంతా, ఇందలి వృక్షజాలంగాని, జంతుజాలంగాని, వాటినుండి వుద్భవించిన మానవజాతిగాని, సమస్తమూ కోట్లసంవత్సరాల పరిణామక్రమంలో ఏర్పడినవేగాని, వున్నపాళాన అదేరూపాలతో అవతరించినవి కావని ఈతడు రుజువుచేసాడు. దీనితో ఆధ్యాత్మికవాదం చావుదెబ్బతిన్నది. కాని

గతితార్కికపద్ధతిలో ఆలోచించే శాస్త్రజ్ఞులు ఇంకా స్వల్పంగానే వున్నారు. అందుచేతనే, ఈనూతనపరిశీలనాక్రమమునకూ పురాతనకాలంనుండీ ఆచారసిద్ధంగా వచ్చేఆలోచనా పద్ధతికీ మధ్య తీవ్ర సంఘర్షణ ఏర్పడింది. ఇందుమూలకంగా సిద్ధాంతరూపంలో వున్న ప్రకృతిశాస్త్రములలో అంతులేని గందరగోళం బయలుదేరింది; గురువు శిష్యులూ, రచయిత చదువరులూ, ఉభయులూకూడా ఈ గంద్రగోళాన్ని అర్థం చేసుకోలేక నిరాశాహతులగుటకు దారి తీసింది.

మనం ఒకమూర్తి, ఆమూర్తి అంతమగుట అనేక్రియ, ప్రతిక్రియలను, ప్రగతి, తిరోగతులను లెక్కలోనికి తీసికొనాలి; ఆవిధమైన గతితార్కికపద్ధతిద్వారానే ఈ విశ్వముయొక్క నిజస్వరూపమునూ, దాని పరిణామక్రమమునూ, మానవుని పరిణామక్రమమునూ, ఈ పరిణామక్రమము మానవుని మస్తిష్కములో కల్గజేయు భావజాలమునూ మనం సరిగా చూడగలం, అర్థం చేసుకోగలం. అధునాతన జర్మను తత్వశాస్త్రం ఈదృక్పథంనుండే ప్రథమంనుండీ ఆలోచించ ప్రారంభించినది. కాంటు పండితుడు దీనికి దోవతీసాడు. ప్రథమంలో ఏదోవిధంగా ప్రేరేపణ పొందినపిమ్మట సూర్యకుటుంబము శాశ్వతంగానిల్చి, ప్రకాశిస్తూవుంటుం దిఅన్నది విశ్వవిఖ్యాతమగు న్యూటన్ పండితునిసిద్ధాంతము. ఈసిద్ధాంతాన్నితీసుకొని కాంటు పండితుడు, సూర్యకుటుంబము యొక్క చారిత్రిక పరిణామక్రమమును విశదీకరించి, న్యూటన్ సిద్ధాంతములోని వైరుధ్యాలను పరిష్కరించాడు. సూర్యుడు, ఇతరగ్రహాలూ అన్నీ నలయాకారంలో పరిభ్రమించే ఒక కాంతిపుంజమునుండి ఏర్పడినవని కాంటు

పండితుడు తెల్పాడు. కాని సూర్యకుటుంబానికి ఎప్పుడైతే పుట్టుక వున్నదన్నాడో, దాని వెనువెంటనే ఆకుటుంబం చివరకు విలీనమై పోతుంది అనికూడా అన్నాడు. కాంటు పండితుని ఈసిద్ధాంతాన్ని, తర్వాత 50 ఏండ్లకు రూఢిపరుస్తూ 'లాప్లాసు' పండితుడు గణితశాస్త్రపువాదులను ఏర్పర్చాడు. మరో 50 ఏండ్లు గడచినపిమ్మట విచ్ఛిన్న కిరణదర్శిని (Spectrascope) ద్వారా, అంతకంతకూ ఘనీభవిస్తూ అనేకదశలలోవున్న తేజోవాయుపుంజములు అనంతాకాశములో వున్నవని రుజువు చేయబడినవి.

ఈ నూతన జర్మను తత్వశాస్త్రం హెగెల్ పండితునిలో పరిపూర్ణత నందినది. ఈతత్వశాస్త్రంలోని ప్రత్యేక ఘనత ఏమిటంటే సాధారణ ప్రపంచం, ప్రపంచచరిత్ర, యోగరూపమగు ప్రపంచంఅంతా ఒక క్రమములో, అంటే నిరంతరం చలనంలో వున్నట్లుగా మార్పుజెందుచున్నట్లుగా రూపపరివర్తనం చెందుచున్నట్లుగా, అభివృద్ధి చెందుచున్నట్లుగా చూపిస్తుంది. మొట్టమొదటిసారిగా, ఈమార్పులలో ఈఅభివృద్ధిలోవుండే పరస్పర అంతర సంబంధాలకు అర్థం చెప్పుటకు ప్రయత్నం జరిగింది. ఇంతవరకూ మానవజాతి చరిత్ర, హేతువాదదృష్టితోనూ, న్యాయశాస్త్రరీత్యానూ చూస్తే, ఖండించదగినటువంటి దౌర్జన్యంగా, ఏమీ జ్ఞాపకం వుంచుకోనవుసరం లేనట్టి అర్థవిహీనమగు చరిత్రగా కన్పించేది; కాని ఈ నూతనదృక్పథంనుండి చూస్తే ఈ చరిత్ర మానవజాతియొక్క అభివృద్ధి క్రమముగా కన్పింపసాగింది. దీనితో మానవుని మేధస్సుకు బాగా పనితగిలింది. చరిత్రలో అల్లి

బిల్లిగా అల్లుకొనియున్న మార్గాలన్నిటినీ పట్టుకొని వెతకాలి; పరిణామక్రమం యొక్క క్రమాభివృద్ధి దశలను అనుసరిస్తూ ఆ చిక్కులను విడదీయాలి; దైవికంగా జరుగుచున్నవని ఇంత వరకూ అనుకొనే ఘటనలకూ, దృష్టిగోచర ప్రపంచమునకూ అంతటికీ సంబంధించిన ఏకైక సూత్రమును, ఈ వంకరటింకర పరిణామక్రమ మంతటిలోనూ ఏకసూత్రంగా వుండే అంతర్గత క్రమమును కనిపెట్టాలి: ఇది మానవ మేధస్సుయొక్క కర్తవ్య మైనది.

ఈ కర్తవ్య నిర్వహణలో హెగెల్ జయప్రదం కాలే దన్నది అప్రస్తుతం. ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించటమే ఆతను చేసిన అఖండసేవ. ఈ కర్తవ్యం ఏఒక్క వ్యక్తిగాని— ఆత డెంత ప్రతిభాసంపన్నుడు కానీయండి— నిర్వహించ అశక్య మైనంత బ్రహ్మాండమైనది. అందుచేతనే హెగెల్ సిద్ధాంతాన్ని మాత్రం ప్రతిపాదించగల్గాడు గాని, ఆసిద్ధాంతానుసరణరీత్యా ప్రపంచరహస్యములను పూర్తిగా ఛేదించలేక పోయాడు. సెయింట్ సైమన్ వలెనే హెగెల్ పండితుడు కూడా తన కాలం లోని ప్రజ్ఞాధురీణులలో ప్రథముడు: కాని ఆతనికి కొన్ని హద్దు లున్నవి. ఒకటి, ఆతని పరిమితజ్ఞానం, రెండు; ఆతని కాలం లోని జ్ఞానంయొక్క, భావాలుయొక్క కొలది పరిమితి: ఇంతే గాదు; మూడవ కారణం మరొకటివున్నది, హెగెల్ ఆదర్శ వాది. మనస్సులో కల్గే భావాలు వాస్తవిక వస్తువులయొక్క, వాటి వృద్ధిక్రమములయొక్క కొద్దోగొప్పో అస్పష్టములగు బింబములు అన్నవి ఆతనివుద్దేశంకాదు. ప్రపంచమునకు ముందు

నుండీ, ఎక్కడనో ఎట్లోవున్న "భావం" * యొక్క ప్రతిమలే. బింబములే వాస్తవికతనుపొంది, వస్తువులుగాను వాటివృద్ధి క్రమములుగాను కన్పిస్తున్నవని హెగెల్ వాదం, అంటే హెగెల్ ఆలోచన తల్లక్రిందులుగా వున్నది.; అందుచేతనే ఆతడు పరిణామక్రమం మూల కారణములనన్నిటినీ తల్లక్రిందులుగా చూచాడు. ఈ పరిణామ క్రమంలోవుండే అనేక అంతర్గత సంబంధాలను హెగెల్ సరిగానే కనుగొన్నాడు. కాని వాటిని ఒకే మొత్తంలో భాగాలుగాగాక, విడివిడిగా తలపోసాడు. ఈ విధంగా పరిణామక్రమంలోని అంతర్గత సంబంధాలను విడి విడిగా చూచుటవల్ల, వివరముల కడకు వచ్చేసరికీ వాటి అర్థం తెలుసుకోలేకపోయాడు. కాబట్టి అవన్నీ ఆతనికి అతుకులబొంతగాను, కృత్రిమంగాను, సాగదీసిన విధంగాను; ఒక్కమాటలో చెప్పాలంటే, తప్పుగాను, కన్పించినవి. కాబట్టి హెగెల్ సిద్ధాంతం కొండను తవ్వి ఎలుకను పట్టినట్లయినది; ఇది బ్రహ్మాండమగు గర్భస్రావంవంటిది. కాని ఈ తప్పుడు దృక్పథం హెగెల్‌తోనే అంతమైనది. హెగెల్ సిద్ధాంతం స్వభావసిద్ధంగా పరిష్కారసాధ్యంకానట్టి వైరుధ్యాలతో కూడుకొనివున్నది. మానవచరిత్ర అంత ఒక పరిణామ క్రమమనీ, అందుచేతనే 'ఇదే పరమసత్యం' అనీ చెప్పి, మానవజ్ఞానం పరమావధిని పొందినదని చెప్పటం అసాధ్య

---

* హెగెల్ "భావం "అనీ, "అఖండభావం "అనీ వుపయోగించాడు. ఈ "భావం "అన్నది ప్రచ్ఛన్నంగావుండే భగవంతుడే. వీటి వెనుక "సృష్టికర్త మీదవుండే విశ్వాసం యొక్క చిహ్నాలు" దాగుకొనే వున్నాయి. కాబట్టి హెగెల్ ఆదర్శవాదిగా, ఆస్తికుడుగా తయారైనాడు.

(అనువాదకుడు)

మనీ హెగెల్ సిద్ధాంతం ఒకమూల చెప్పుతుంది; కాని వెంటనే దీనికి పూర్తిగా విరుద్ధంగా, తానే (హెగెల్ సిద్ధాంతమే) ఈ పరమసత్యం అని గట్టిగా చెప్పుతుంది. హెగెల్ పద్ధతి గతితార్కిక పద్ధతి; కాని, అన్ని కాలాలకు వర్తించునట్టి; పరమ ప్రామాణికములైనట్టి చారిత్రిక జ్ఞానంలోకజ్ఞానంఒకటి వున్నదని చెప్పటం ఈ గతితార్కిక పద్ధతికి పూర్తిగా వ్యతిరేకం. ఈ బాహ్య ప్రపంచాన్ని గూర్చిన మనజ్ఞానం ఇంతటితో పరమావధి పొందినది అన్నదికాదు గతితార్కిక పద్ధతి; పైగా, ఇందుకు పూర్తిగా వ్యతిరేకంగా, మన ఈ చరిత్ర జ్ఞానం తరతరానికీ పెద్దపెద్ద అంగలతో ముందుకు సాగుతూ అభివృద్ధి అవుతూవుంటుంది అన్నది గతితార్కిక పద్ధతి.

వెనుకటి జర్మను ఆదర్శవాదం అంతా తప్పుఅని గ్రహించటం తప్పనిసరిగా భౌతికవాదానికి దారి తీసింది. కాని ఈ భౌతికవాదం ఆధ్యాత్మికవాదమును బోలిన 18 వ శతాబ్దపు భౌతికవాదమూకాదు; మెకానికల్ భౌతికవాదమూ కాదు, పూర్వచరిత్రను యాదాలాభముగా చూడటంగాక ఆధునిక భౌతికవాదం చరిత్రను మానవజాతియొక్క పరిణామక్రమంగా చూస్తుంది; ఈ పరిణామగతి చలనహేతువులను వెతికి పట్టుకొనటమే తన ముందున్న సమస్యగా భావిస్తుంది. 18 వ శతాబ్దపు ఫ్రెంచి తత్త్వవేత్తలైతేనేమి, హెగెల్ పండితులైతేనేమి ప్రకృతినంతా ఒకే మొత్తముగా చూచారు; ఈ ప్రకృతి చిన్న చిన్న వలయాలలో గుడుగుడుమని తిరుగుతూవుంటుందనీ, న్యూటన్ చెప్పినట్లుగా ఆదిమధ్యాంత రహితములగు దివ్యమూర్తులవలె అనశ్వరమనీ, లెన్నియస్

చెప్పినట్లుగా మార్పుజెందవీలులేని ప్రాణివర్గాలతో కూడి వుంటుందనీ వీరు భావించారు. కాని దీనికి విరుద్ధంగా, ఆధునిక భౌతికవాదం ఆధునిక ప్రకృతిశాస్త్రాల పరిశోధనలపై ఆధారపడివున్నది. కాలావధిలో ప్రకృతికికూడా చరిత్ర వున్నదనీ, దివ్యమూర్తులలోకూడా అనుకూల పరిస్థితులలో ప్రాణివర్గములు జనించుచుండుననియూ, ఆ ప్రాణివర్గము లెట్లా పుట్టుచూ గిట్టుచూ వుంటాయో అదేవిధంగా ఆదివ్య మూర్తులు (గ్రహములు, నక్షత్రములు మున్నగునవి — అనువాదకుడు) కూడా పుట్టుచూ గిట్టుచూ వుంటాయనీ, తిరిగి తిరిగి సంభవించే కాలచక్రములు, మనకు తెలిసినంతవరకూ అంతకంతకూ బ్రహ్మాండాంతసంవర్ధము లౌచున్నవనీ ఈ ఆధునిక ప్రకృతి శాస్త్రములు తెలియజేస్తున్నవి. ఇట్టి ప్రకృతి శాస్త్రములపైననే ఆధునికభౌతికవాదం ఆధారపడుచున్నది. రెండు సందర్భాలలోనూ ఆధునిక భౌతికవాదం పూర్తిగా గతితార్కికమే; ఏ వైజ్ఞానిక శాస్త్రముతోనూ సంబంధం లేకుండా, వాటికి అతీతంగా నిలబడే ఏ తత్వసిద్ధాంతమూ ఆధునిక భౌతికవాదానికి అవసరంలేదు. బ్రహ్మాండమగు వస్తుసముదాయమున్నది; ఆవస్తుసముదాయమును గూర్చిన జ్ఞానం మనకున్నది; ఒక్కొక్క ప్రత్యేక విజ్ఞానశాస్త్రమూ ఈ వస్తుసముదాయమునుగూర్చి పరిశోధించుచూ తన స్థానాన్ని స్థిరపర్చుకొనుచున్నప్పుడు, ఈ వస్తుసముదాయపు మొత్తమును గూర్చి తెలియజేసే ప్రత్యేకసైన్సు ఏదీ అవసరంలేదు. పూర్వపు తత్వశాస్త్రం మొత్తంలో ఇక స్వతంత్రంగా మిగిలే సైన్సు ఒకటే; మానవుని మేధస్సునుగూర్చి, దాని సూత్ర

లనుగూర్చి చెప్పేసైన్సు ఒక్కటే—తర్కము, గతితర్కము—మాత్రమే మిగులుతుంది. ఇక మిగిలినదంతా ప్రకృతి, చరిత్ర శాస్త్రములలో కలిసిపోతుంది.

పరిశోధనలద్వారా ఎంతవరకైతే మనజ్ఞానసంపద వృద్ధియైనదో అంతవరకే ప్రకృతిని గూర్చిన మన దృక్పథంలో విప్లవం రాగలదు; అయినా చరిత్రనుగూర్చిన దృక్పథంలో పెద్ద మార్పువస్తానికై అంతకు పూర్వమే కొన్ని చారిత్రిక సంఘటనలు జరిగినవి. 1831లో లయన్సుపట్టణంలో మొట్ట మొదటి కార్మిక తిరుగుబాటు * జరిగింది. 1838–1842 మధ్య కాలంలో ఛార్టిస్టు వుద్యమం ** (ప్రథమజాతీయ కార్మికో

---

*కనీస వేతనములకొరకై ప్రదర్శనం జరుపుతూవుండగా 1831 లో లయన్సుపట్టణ కార్మికులపై తుపాకులు కాల్చబడెను. ఈ కాల్పులకు వ్యతిరేకంగా ఈతిరుగుబాటు జరిగింది. పట్టణమంతటా బారికేడ్లు [రోడ్లపై ఎక్కడకక్కడ కట్టబడిన చిన్నచిన్న కోటలు] నిర్మింపబడినవి; కొలది దినముల వరకూ పట్టణం కార్మికుల స్వాధీనంలో వున్నది. చివరకు, లయన్సు పట్టణం లోని బూర్జువావర్గం సహాయార్థం రెగ్యులర్ సైన్యం వచ్చినప్పుడే ఈ తిరుగుబాటు అణచివేయబడింది. [అనువాదకుడు]

** ప్రపంచంలో మొట్టమొదటగా ప్రారంభింపబడిన రాజకీయ కార్మికోద్యమం ఈ ఛార్టిస్టు వుద్యమం. ఇది 1830_1850 కాలంనాటిది. ఇంగ్లాండులోని కార్మికవర్గంలో అధికభాగం ఈ ఉద్యమంలో పాల్గొన్నది. ఇది ప్రథమ రాజకీయ కార్మికోద్యమం కావటంవల్లనే దీనికింత అత్యధిక ప్రాముఖ్యత వున్నదనీ మార్క్సు, ఎంగెల్సు, లెనిన్‌లు తెలియజేసారు. 1839 లో కార్మికులు పార్లమెంటుకు యిచ్చిన "ఛార్టరు"ను బట్టి దీనికి ఛార్టిస్టు వుద్యమమని పేరువచ్చింది. ఈ ఛార్టరులోని ప్రధానకోర్కెలు, (1) 21 ఏండ్లు దాటినవారి కందరికీ ఓటింగు హక్కు. (2) ప్రతి ఏడాది పార్లమెంటు ఎన్నికలు. (3) రహస్య బాలెటు పద్ధతిపై ఎన్నికలు జరుగుట. (4)

ద్యమం) ఇంగ్లాండులో వుచ్ఛదశలోవున్నది. ఐరోపాలోని వివిధ దేశాలలోనూ బూర్జువా కార్మికవర్గాల మధ్యవర్గం పోరాటం ఆదేశంలో భారీ పరిశ్రమల వృద్ధికీ బూర్జువా వర్గం రాజ్యాధికారాన్ని గెల్చినదానికీ అనుగుణ్యంగా తీవ్రమైనది. పెట్టుబడిదారుల; కార్మికుల ప్రయోజనాలు ఒకటేననీ, స్వేచ్ఛా వ్యాపార పోటీవల్ల విశ్వమానవ కల్యాణమూ, సంపదాభివృద్ధీ జరుగుననీ బూర్జువా అర్థశాస్త్రం బోధించే విషయాలు పచ్చి అబద్ధాలనీ అంతకంతకూ రుజువౌతూ వచ్చినవి. ఈ విషయాలూ నిర్లక్షింపబడుటకు వీలులేదు; ఈ విషయాలపై, ఎంత అస్పష్టంగా కానీయండి, ఆధారపడిన ఇంగ్లీషు ఫ్రెంచి సోషలిష్టు సిద్ధాంతాలనూ నిర్లక్షించుటకు వీలులేదు. కాని చరిత్రను గూర్చిన ఆదర్శదృక్పథం ఇంకా రద్దుగావింపబడలేదు. ఈ ఆదర్శవాదానికి భౌతిక విషయాలపై ఆధారపడిన వర్గపోరాటాలు వుంటాయన్న విషయంగాని అసలు భౌతిక ప్రయోజనాలు వుంటాయన్న విషయంగాని తెలియవు. ఉత్పత్తిగాని, ఏ ఆర్థిక సంబంధాలుగాని ఛాన్సుగా ఏర్పడినవేననీ, "నాగరిక చరిత్ర" లో ఇవి అత్యల్పవిషయాలనీ ఈ ఆదర్శవాదం చూస్తుంది.

ప్రకృతిశాస్త్ర పరిశోధనలవల్ల దేలిన నూతన విషయాలవల్ల వెనుకటి చరిత్రనంతటినీ నూతనంగా పరీక్షించ

---

పార్లమెంటు సభ్యులకు జీతాలు. (5) సమాన నియోజకవర్గాలు. (6) పార్లమెంటు ఎన్నికలలో నిల్చు అభ్యర్థులకుండవలసిన ఆస్థి హక్కుల నియమాన్ని రద్దుచేయుట.

ఈ హక్కులకొరకై పోరాటం సమ్మెలద్వారా, ప్రదర్శనములద్వారా, సాయుధతిరుగుబాట్లద్వారా చాలాసంవత్సరాలు జరిగినది. (అనువాదకుడు)

వలసిన అవుసరం ఏర్పడింది. ఈవిధంగా పరీక్షించినప్పుడే, ఒక్క పురాతన కమ్యూనిష్టు సమాజ పరిస్థితులను మినహాయిస్తే, తక్కిన పూర్వచరిత్రయంతా వర్గకలహాముల చరిత్రగా కన్పిస్తుంది. ఈ కలహించే వర్గాలు, ఆనాటి వుత్పత్తి, మారకముల సంబంధాలనుబట్టి, అంటే, ఒకమాటలో, ఆర్థిక సంబధాలబట్టి ఏర్పడుతాయని తెలిసింది. కాబట్టి సమాజంలో ఆర్థిక కట్టడమే ప్రతిదానికీ పునాదిగా వుంటుందనీ, ఈ పునాదిపైననే, ఆకాలంయొక్క న్యాయ, రాజకీయ సంస్థలూ, మత, తాత్త్వికసిద్ధాంతాలూ అన్నీ ఏర్పడుతాయనీ తెలిసింది. చరిత్రజ్ఞానం ప్రథమంలో ఆధ్యాత్మిక వాదపూరితంగా వుండేది; హెగెల్ దీనిని మళ్ళించి గతితార్కికదృక్పథాన్ని కల్గించాడు. కాని హెగెల్‌యొక్క చరిత్రదృక్పథంకూడా ఆదర్శవాదపూరితము. కాని ఇప్పుడో, ఈ చివరిస్థానంనుండి కూడా — చరిత్రతత్వమునుండికూడా - ఆదర్శవాదం తరిమివేయబడింది. చరిత్ర కిప్పుడు భౌతికదృక్పథం కల్గించబడినది. ఇంతవరకూ తత్వవేత్తలు చెప్పుచున్నట్లుగా, చైతన్యంనుండి మానవుని అస్తిత్వం ఏర్పడుచున్నది అనిగాక మానవుని అస్తిత్వంవల్లనే ఆతని చైతన్యం ఏర్పడుచున్నదని తెల్పుట ప్రారంభమైనది.

ఇప్పటినుండి సోషలిజమంటే ఏ అఖండమేధావి వల్లనో అదృష్టవశాత్తు కనిపెట్టబడిన సిద్ధాంతంగాగాక, చారిత్రికంగా అభివృద్ధి పొందిన రెండు వర్గాలయొక్క - బూర్జువా శ్రామిక వర్గాలయొక్క — తప్పనిసరియగు పోరాటఫలితంగా కన్పించ

సాగింది. సమాజవ్యవస్థను సాధ్యమైనంతవరకు సర్వాంగ శోభితంగా తయారుచేయటం గాక, యీవర్గాలు యీ కలహాలు యెందువల్ల తప్పనిసరిగా కల్గుచున్నవో ఆచారిత్రిక, ఆర్థికవిషయాలను కనిపెట్టడం యీ విధంగా యేర్పడిన పరిస్థితులనుండే ఆ కలహాలను పరిష్కరించుట కవసరమైన సాధనాలను కనిపెట్టడం కర్తవ్యమగుచున్నది. ఫ్రెంచి భౌతికవాదం గతితార్కికవాదానికీ, ఆధునిక ప్రకృతి శాస్త్రములకు ఎంత దూరమో, అదేవిధంగా వెనుకటి సోషజలింకూడ యీపై చారిత్రిక భౌతికవాదదృష్టికీ అంతేదూరం. కాపిటలిస్టు వుత్పత్తి విధానమునూ, యీ వుత్పత్తివిధానంవల్ల కల్గే ఫలితాలనూ యీ పూర్వపు సోషలిజం చాలా నిశితంగా విమర్శించినమాట నిజమే; కాని దీనికి కారణాలేమిటో యిది చెప్పనూలేక పోయింది; పరిష్కరించనూ లేకపోయింది; వాటిని చెడుగులుగా చూపి రద్దుగావించాలని మాత్రమే అది చేసినపని. కార్మికవర్గంతో బాటుగానేవుండే దోపిడీని ఘాటుగా ఖండించిన కొలదీ, యీ దోపిడి ఎందులో వున్నది? ఎట్లా జరుగుచున్నది? అనే విషయాలను అంత ఎక్కువగానూ చెప్పలేకపోయింది. చేయవలసినదంతా ఒకటే: ఈ కాపిటలిస్టు వుత్పత్తి విధానం అంటే ఏమిటి, దాని చారిత్రికక్రమం ఏమిటి, ఒక చారిత్రికదశలో అది ఏవిధంగా తప్పనిసరియగు చున్నది, ఇందువల్లనే అది తప్పనిసరిగా మరొక చారిత్రికదశలో నాశనమౌతుంది అనేవి ఋజువుచేయుటం ఒకప్రక్క; ఇంకా స్పష్టంగా బయటపడని దీని ప్రధానస్వభావాన్ని బహిర్గతం చేయటం మరొకప్రక్క కావలసియున్నది. ఈ కర్తవ్యమే అదనపువిలువ

సిద్ధాంతం కనిపెట్టటంద్వారా నెరవేరింది. కాపిటలిస్టు వుత్పత్తి విధానానికి, దానినుంచి జరిగే కార్మికుల దోపిడీకి మూలం, కూలి యివ్వబడకుండా శ్రమనుచేయించుకొని ఆ శ్రమఫలితాన్ని కాజేయటమేనని చూపబడింది; మార్కెటులో ఒక సరుకుకు పూర్తివిలువయిచ్చి కొన్నట్లు గానే కాపిటలిస్టు కార్మికుని శ్రమశక్తికి పూర్తి విలువయిచ్చి ఆశ్రమశక్తి ఉపయోగించుకుంటున్నాడు. అయినప్పటికి అతడు ఆ శ్రమశక్తికి చెల్లించినవిలువకన్న ఆ శ్రమశక్తిని వుపయోగించుటద్వారా వుత్పత్తిగావించే విలువ యెక్కువ. ఇదే అదనపువిలువ. ఈ అదనపువిలువయే కోటీశ్వరుల కాపిటల్‌ను వృద్ధి చేసే ధనరాసులు. ఈవిధంగా కాపిటలిస్టు వుత్పత్తిక్రిమము, కాపిటల్ వుత్పత్తి క్రిమము స్పష్టం చేయబడినవి.

ఈరెండుగొప్ప పరిశీలనములూ — చారిత్రిక భౌతిక వాదదృక్పథమూ, అదనపువిలువద్వారా జరిగే కాపిటలిస్టు దోపిడీయొక్క రహస్యం వెల్లడి జేయబడటం — పూర్తిగా మార్క్సు వల్లనే జరిగినవి. ఈరెండు పరిశీలనముల వల్లనే సోషలిజం ఒకసైన్సుగా తయారైంది; ఇక దాని పూర్తి సంబంధాలను వివరాలను అభివృద్ధి చేయటమే కావలసింది.

# III

సరుకులవుత్పత్తి, ఉత్పత్తితోబాటు మారకములు, ఇవే ప్రతి సామాజికవ్యవస్థయొక్క పునాది; చరిత్రలో మనకు కన్పించిన సమాజవ్యవస్థ లన్నింటిలోనూ ఏది ఎట్లా ఉత్పత్తి గావించబడినదీ, ఒక దానితో మరొకటి ఎట్లా మారు చున్నది అనే వాటినిబట్టియే వస్తువుల పంపకం జరగటం, దానితో బాటుగా సమాజం వర్గాలక్రింద చీలటం; ఈ సూత్రమునుండియే చారిత్రిక భౌతికవాదము ప్రారంభమాచు న్నది. ఈదృక్పథంనుండి చూస్తే, అన్ని సామాజికమార్పులకు రాజకీయ విప్లవాలకూ మూలకారణాలు మానవుల భావ ములనుండిగాక, వీరు అఖండ సత్యమును, అఖండన్యాయ మును అంతకంతకూ ఎక్కువగా తెలుసుకొనుచుండుటను బట్టిగాక, వుత్పత్తివిధానంలోనూ, మారకంలోనూ కల్గే మార్పులలోనే వున్నవని తెలుసుకొనగలము; తత్వశాస్త్రంలో గాక, ఆకాలంలోని ఆర్థికవిషయాలలో ఈమూలకారణాలు ఇమిడివున్నవని కనుగొనగలం. ప్రస్తుత సామాజికసంస్థలు హేతువిరుద్ధములూ, అన్యాయసంగతములూ అనీ, హేతు వాదము (రీజన్ Reason) నాన్సెన్సు అయిందనీ, మంచిపను లనేవి పీడాకరములుగా పరిణమించినవనీ అంతకంతకూ ఎక్కువ స్పష్టం అయినది. అంటే ఇది వెనుకటి ఆర్థికపరిస్థితులకు అను గుణ్యంగా ఏర్పడిన సామాజికవ్యవస్థ, వుత్పత్తిపద్ధతులలోనూ

మారకంరూపాలలోనూ నిశ్శబ్దంగా జరిగేమార్పులకు సరిపడటంలేదనే విషయానికి చిహ్నంమాత్రమే. దీనినిబట్టి ఈబహిర్గతమైన చెడుగులుకూడా ఏమార్గాలద్వారా రద్దుచేయబడగలవో అట్టి మార్గములుకూడా, కొద్దో గొప్పో అభివృద్ధిజెందిన రూపంలో, ఈ మారినవుత్పత్తి పరిస్థితులలోనే వుండి వుండాలి అనేది స్పష్టమౌచున్నది. ఈ మార్గాలు మనస్సు నుండి సృష్టించబడనక్కరలేదు. వాస్తవంగావున్న భౌతిక వుత్పత్తిసంబంధాలలోనే ఇవి వున్నవి; వీటిని మనస్సు సహాయంతో కనిపెట్టవలసిమాత్రమే వున్నది.

అయితే, ఈదృష్ట్యా, ఆధునిక సోషలిజం ఎక్కడ నిలబడి వున్నది ?

ప్రస్తుత సమాజ వ్యవస్థ ప్రస్తుత పరిపాలకవర్గమగు బూర్జువా వర్గసృష్టి: దాదాపుగా అందరిచేతనూ నేడు ఈ విషయం అంగీకరింపబడింది. బూర్జువా వర్గానికి ప్రత్యేకమగు ఈ పద్ధతినే మార్క్సుకాలంనుండీ కాపిటలిస్టు వుత్పత్తివిధానమని పిలుస్తున్నాము. ఈ కాపిటలిస్టు వుత్పత్తి పద్ధతి, జమీందారీ వ్యవస్థలో వుండే స్థానిక స్వాధికారాలతోనూ, జన్మనుబట్టి ఏర్పడిన స్వాధికారాలతోనూ, పరస్పర వ్యక్తి బంధములతోనూ సరిపడనట్టిది. కాబట్టి బూర్జువావర్గం జమీందారీ వ్యవస్థను భగ్నంజేసి, దాని శిథిలములపై బూర్జువా సమాజ వ్యవస్థనూ, స్వేచ్ఛావ్యాపార పోటీరాజ్యాన్ని; స్వేచ్ఛాగమనమునకు, సరుకుల స్వంతదారులకు సమాన హక్కులను; ఇట్టివే అగు ఇతర బూర్జువా ప్రతాపముల నన్నిటినీ స్థాపిం

చింది. కాపిటలిస్టు వుత్పత్తి విధానం ఇప్పుడు మిక్కిలి స్వేచ్ఛతో అభివృద్ధికావచ్చును. ఆవిరిశక్తి, పనిముట్లు వుత్పత్తి సూత్ర ములు కనిపెట్టబడినప్పటినుండీ, లోగడవున్న పారిశ్రామిక విధానము భారీ పారిశ్రామికోత్పత్తిగా అభివృద్ధికాగానే, ఈ బూర్జువా దర్శకత్వంక్రింద సృష్టింపబడిన వుత్పత్తిశక్తులు కని విని ఎరుగనంతటి విపరీత వేగంతో వృద్ధికాజొచ్చినవి; కాని ఏ విధంగా పారిశ్రామికోత్పత్తీ, దాని ద్వారానే మరింత వృద్ధి యైన కుటీర పారిశ్రామికోత్పత్తీ జమీందారీ వ్యవస్థలోవున్న వర్తక శ్రేణుల బంధములతో లోగడ ఘర్షణపడినవో, అదే విధంగా ఈభారీపారిశ్రామికోత్పత్తికూడా, అది అభివృద్ధి జెందు చున్నకొలదీ, దాని జన్మకు కారణమైన కాపిటలిస్టు వుత్పత్తి పద్ధతి కన్పించే అడ్డంకులతో ఘర్షణ పడుతుంది. ఈ నూతన వుత్పత్తిశక్తులు, వాటి నుపయోగంలోకి తెచ్చే బూర్జువా పద్ధతులను మించి పెరిగినవి: ఈ వుత్పత్తి శక్తులమధ్యనూ, వుత్పత్తి విధానం మధ్యనూ ఏర్పడిన ఈ వైరుధ్యం, 'ప్రథమ తప్పిదం – దైవశిక్ష' అనే సిద్ధాంతంవలె మానవుల భావంలో నుండి పుట్టినదిగాక,యథార్థంగా మనకు బయటనే వాటినుత్పత్తి గావించిన మానవుల ఇచ్ఛకు, వుద్దేశములకు సంబంధం లేకుం డానే, వాస్తవజగత్తులోనే వున్నది. ఈ వాస్తవిక సంఘర్షణ మానవుల మనస్సులలో ప్రతిఫలించుటద్వారానే; మొట్ట మొదటగా ఈ సంఘర్షణవల్లనూటిగా బాధింపబడే వర్గం— కార్మికవర్గం — యొక్క మనస్సులో ఇది ప్రతిఫలించుట ఫలి తంగా ఏర్పడిన ఆదర్శ రూపమే ఈ ఆధునిక సోషలిజం.

అయితే ఈ సంఘర్షణ ఎందులో వున్నది ?

కాపిటలిస్టు వుత్పత్తి విధానానికి పూర్వం, అనగా మధ్య యుగాలలో, స్వల్పవుత్పత్తి విధానం సామాన్యంగా వుండేది. ఈ విధానంలో, వుత్పత్తి సాధనాలు వాటి నుపయోగించే శ్రామికుల స్వంతములు. స్వతంత్రులుగావున్నట్టి లేక బానిస రైతులుగా వున్నట్టి చిన్నరైతులు సాగించే వ్యవసాయపరిశ్రమ, పట్టణాలలోవుండే చేతిపరిశ్రమలు; భూమి, వ్యవసాయోపకరణములు, కర్మాగారములు, పనిముట్లు మున్నగు శ్రమసాధనము లన్నీ స్వంత వుపయోగమునకై వుద్దేశింపబడిన వ్యక్తుల స్వంత సాధనాలు. ఇవి ఒక్కొక్క వ్యక్తివి కాబట్టి తప్పనిసరిగా, పరిమాణంలోనూ, సంఖ్యలోనూ, పనితనంలోనూ స్వల్పమైనట్టివి; ఇవి స్వల్పములు కాబట్టే తప్పనిసరిగా వుత్పత్తిదారుని స్వంతములుగా వుండేవి. చెదురుగాను, స్వల్పముగాను వున్న ఇట్టి వుత్పత్తిపరికరాలను కేంద్రీకరించి, వృద్ధిజేసి, ఈనాడు జరిగే బ్రహ్మాండమగు వుత్పత్తికి మీటలుగా (లీవర్లుగా) మార్చు చారిత్రికపాత్రనే ఈ కాపిలిస్టు వుత్పత్తివిధానమూ, దాని ప్రతినిధియగు బూర్జువా వర్గమూ నిర్వహించినది. 15వ శతాబ్దం పిమ్మట, ఈ వుత్పత్తిక్రమం చారిత్రికంగా ఏవిధంగా సామాన్య సహకార పద్ధతి, పారిశ్రామికవిధానము (Manufacture) భారీపారిశ్రామికవిధానము (large-scale industry) అను మూడు దశలుగా అభివృద్ధియైనదో, మార్క్సు 'కాపిటల్' 4వ భాగంలో వివరించాడు. కాని మార్క్సు చెప్పినట్లుగానే, బూర్జువావర్గంకూడా ఈ వ్యక్తిగత వుత్పత్తిపరికరాలను ప్రజాసమూహం మొత్తం వుపయోగించే సామాజిక వుత్పత్తిపరికరాలుగా మార్చిదేనగాని, వాటిని బ్రహ్మాండమగు వుత్పత్తి

శక్తులుగా మార్చలేక పోయినది. రాట్నం, చేమగ్గం, కమ్మరి సమ్మెటల స్థానే నూలు మరలు, మరమగ్గము, ఆవిరిసమ్మెటలు వచ్చినవి. చిన్నవ్యక్తిగత కార్ఖానాలను వందలు, వేలు కార్మికులు పనిజేసే ఫాక్టరీలు ఆక్రమించినవి. ఉత్పత్తిపరికరాల వలెనే వుత్పత్తికూడా అసంఖ్యాకులగు వ్యక్తులు విడివిడి వుత్పత్తిగాగాక సామాజిక వుత్పత్తి పరంపరగా మారింది. దినుసులు (Products) కూడా వ్యక్తుల దినుసులుగాగాక సామాజికదినుసులుగా అయినవి. ఫాక్టరీనుండి వుత్పత్తియై బైటకు వచ్చేనూలు, బట్టలు, ఇనుపసామానులు మున్నగునవన్నీ, అవి పూర్తి దినుసులుగా తయారగుటకు పూర్వం ఎన్నిచేతులగుండా వరుసగా మారినవో అందరూ కార్మికుల ఉమ్మడిదినుసులుగా అవుచున్నవి. కార్మికుడుకూడా 'ఆవస్తువును నేను చేసాను; అదినాది' అనుటకు వీలులేదు.

సమాజంలో వుత్పత్తివిధానంయొక్క మూలరూపం ఎక్కడ స్వతఃసిద్ధమగు శ్రమవిభజనపై ఆధారపడివుందో, అక్కడ, వుత్పత్తివస్తువులు సరుకుల రూపాన్ని పొందగలవు; ఇట్టి సరుకుల పరస్పరమారకం, క్రియ విక్రియములద్వారా వ్యక్తిగతవుత్పత్తిదార్లు తమ భిన్నభిన్న అవుసరాలను తీర్చుకుంటారు. ఇది మధ్యయుగాలలో వుండేది. ఉదాహరణకు, రైతు తన పంటను శిల్పికి అమ్మి దానికిబదులుగా వాని వృత్తి వల్ల తయారైన దినుసులను తీసుకొనేవాడు. సరుకులనువుత్పత్తి గావించేఇట్టివ్యక్తి వుత్పత్తిదార్ల సమాజంలో నూతనవుత్పత్తి విధానం చొరచుకువచ్చి, ఆనాడు సమాజమంతటా వున్న పురాతనపు, ప్లానులేని శ్రమవిభజనబదులు వ్యక్తిగత ఫాక్ట

రీలో నిర్ణీతంకాబడిన ప్లాను సహితమగు శ్రమవిభజనను తెచ్చి పెట్టింది. వ్యక్తిగతవుత్పత్తితోబాటుగా సామాజికోత్పత్తికూడా పొడసూపింది. ఈరెండింటి దినుసులూ దాదాపుఒకే ప్రమాణం ధరలకు ఒకే మార్కెటులో అమ్మబడేవి. కాని స్వాభావసిద్ధమగు శ్రమ విభజనకంటె ప్లానుసహితమగు శ్రమవిభజన బలీయమైనది; వ్యక్తిగతంగా పనిజేసే చిన్న వుత్పత్తిదార్లకంటె కార్మికశక్తి సామాజికంగా సంఘటితం గావింపబడిన ఫాక్టరీలు సరుకులను ఎంతో చవుకగా వుత్పత్తిని గావించేవి. కాబట్టి ఒక్కొక్కరంగంనుండీ వ్యక్తిగతవుత్పత్తివిధానం ఓడించబడింది. సామాజికోత్పత్తివిధానం పూర్వపు వుత్పత్తి విధానములన్నిటిలోనూ విప్లవకరములగు మార్పులను తెచ్చింది. కాని, దీని విప్లవస్వభావం మాత్రం ఆకాలాలలో పూర్తిగా అర్థం చేసుకొనబడలేదు; సరుకులవుత్పత్తికి కేవలం ప్రోత్సాహం యిచ్చేదిగాను త్వరితగతిని చేకూర్చేదిగాను మాత్రమే ఈసామాజికోత్పత్తివిధానం చూడబడింది. దాని పుట్టుకతోనే అది అప్పటికేవున్న సరుకులవుత్పత్తి, మారకములయొక్క కొన్ని మీటలతో; వర్తకుల కాపిటల్, చేతిపనులు, కూలిపనులతో; సూటిగా సంబంధాన్ని కల్గివున్నది. ఇది ఎంతవరకూ నూతనవుత్పత్తివిధానంగా తయారైతే అందుకు అనుగుణ్యంగా, సరుకుల వుత్పత్తివిధానమునకు సహజమగు భుక్తం (appropriation) రూపాలుకూడా వర్తిస్తూవుండేవి.

మధ్య యుగాలలో అభివృద్ధియైన రీతులబట్టి ఆనాడు, సరుకుల వుత్పత్తివిధానంలో, శ్రమ ఫలితమగు దినుసుయొక్క

ఖామందు ఎవరు అను ప్రశ్న వుదయించేదేకాదు. వ్యక్తిగత వుత్పత్తిదారుడే తన స్వంత ముడిసరుకులతో, తన స్వంత పని ముట్లతో, తన స్వంత శ్రమతోనూ, తన కుటుంబశ్రమ తోనూ దినుసులను వుత్పత్తి జేస్తూవుండటమే నియమంగా వుండేది; ఈ దినుసును భుక్తంజేసుకొనటం అన్న అవుసరమే వుదయించేదికాదు; అది తప్పనిసరిగా అతనిదే. దినుసుపై అతని స్వత్వములు అతని స్వంత శ్రమమీదనే ఆధారపడినవి. ఎప్పుడైనా ఇతరులసహాయం తీసుకొంటే, అది సర్వసాధారణంగా, చేదోడుగా మాత్రమే వుండేది. చాలా సందర్భాలలో, ఇట్టి సహాయానికి కూలికితోడు ఇతర ప్రతిఫలములు కూడా ముట్టజెప్పబడుతూ వుండేవి. వర్తకశ్రేణిలోని ఉమేజువారీలు (journeymen) అభ్యాసకులూ (apprentices ) తనకు వచ్చేతిండి, జీతములకొరకుగాక, ఎక్కువగా, మేస్త్రీలు(master crafts-men) కావాలనే వుద్దేశంతో పనిజేసేవారు. ఇట్టిదశలో వుత్పత్తి సాధనాలు పెద్ద పెద్ద కర్మాగారాలలో, వుత్పత్తి కేంద్రాగారాలలో కేంద్రీకరింపబడినవి: ఆ విధంగా అవి వాస్తవానికి సామాజిక వుత్పత్తి, సాధనాలుగా మారినవి. అయినా, ఈ సామాజిక వుత్పత్తిసాధనములు, సామాజికోత్పత్తి వస్తువులు ఇది వరకువలెనే ఇప్పుడుకూడా వ్యక్తియొక్క వుత్పత్తిసాధనాలుగాను, దినుసులుగాను చూడబడేవి. ఇంతవరకూ ఉత్పత్తి పరికరాల స్వంతదారుడే దినుసులను భుక్తం జేసుకొనేవాడు: ఎందుచేతననగా, అవి నిస్సందేహంగా అవి అతని దినుసులు, ఎవరైనా ఇతరులుతోడుగా సహాయం జేసినా అది అరుదుగా మాత్రమే. కానిఇప్పుడుడుకూడా, సామాజికవుత్పత్తివిధానంలో

కూడా, ఇక దినుసులు తన దినుసులుగాక పోయినా, ఇతరుల శ్రమజన్యములగు దినుసులైనా, వీటిని వుత్పత్తి పరికరాల స్వంతదారుడే భుక్తం జేసుకొంటున్నాడు. కాబట్టి ఇప్పుడు; సామాజికంగా వుత్పత్తి అయ్యే దినుసులు, నిజంగా వుత్పత్తి పరికరాలనన్నిటినీ పనిచేయించి, దినుసులనుత్పత్తి జేసిన వారిచేగాక, కాపిటలిస్టులచే భుక్తం చేసుకొనబడుచున్నవి. నిజానికి, సగ్గుతేలుస్తే, ఉత్పత్తి సాధనాలు, ఉత్పత్తీ కూడా సామాజికమైనవి. కాని ఇవి ప్రతివ్యక్తి తన దినుసును తానే పొంది వుండి, మార్కెటుకు తెస్తూవుండేటటువంటి వ్యక్తుల స్వంత వుత్పత్తి వున్నదా అన్నట్లు, అప్పటి భుక్తం పద్ధతులకే లోనా చున్నది. ఇట్లు అనుకొనుటకు వీలు లేకపోయినా, వుత్పత్తి విధానం ఇట్టి భుక్త పద్ధతులకే లోనుగావలసి వస్తున్నది.* ఈ నూతన వుత్పత్తివిధానమునకు కాపిటలిస్టు రూపాన్ని కల్పించే ఈ వైరుధ్యంలోనే ఈనాటి సంఘర్షణ అంతా బీజరూపంలో వున్నది. ఈ నూతన వుత్పత్తివిధానం, ప్రధాన వుత్పత్తిరంగాలన్నింటినుండీ ఎక్కువ ఆర్థిక ప్రాముఖ్యతగల దేశాలన్నిటి

* భుక్తరూపం — మామూలుగా నేవున్నా, భుక్తస్వభావం కూడా ఉత్పత్తి విధానం వలెనే విప్లవయుతంగా మార్పుజెందినదన్న విషయాన్ని ఇక్కడ వివరించ పనిలేదు. నా స్వంత దినుసు నేను భుక్తం జేసుకొనటం, ఇతరుల దినుసులను నేను భుక్తం జేసుకోవటం నిజానికి, రెండూ పూర్తిగా విభిన్నమైన భుక్తాలు. కాపిటలిస్టువిధానమంతటికి బీజరూపంలోగల కూలిపని చాలా పురాతన సంస్థయనేది సందర్భానుసారంగా ఇక్కడ తెలుసుకొనవచ్చును. చెదురుగా మారుమూలల, ఈ కూలిపని, బానిసత్వంతోబాటుగా, చాల శతాబ్దాలు వృద్ధిఅయింది. కాని కొన్ని చారిత్రిక పరిస్థితులు ఒనగూడినప్పుడే ఈ బీజము కాపిటలిస్టు వుత్పత్తి విధానముగా అభివృద్ధి నొందగలదు. (ఎంగెల్సు నోటు)

లోనూ, ఏవో స్వల్పంగా మిగిలిన పరిశ్రమలనుతప్ప మిగిలిన వ్యక్తిగతవుత్పత్తివిధానమునంతటినీ త్రోసిరాజని తాను ప్రాధాన్యత వహించినకొలదీ, సామాజికవుత్పత్తికీ, కాపిటలిస్టు భుక్తమునకూ (Social production & Capitalist appropriation) ఎక్కడా సరిపడుటలేదనే విషయం మరింత బాహాటంగా స్పష్టమౌతూవచ్చింది.

మేము ఇదివరకే చెప్పినట్లుగా, కాపిటలిజం ప్రథమ దినాలకే కూలిపని వుండటం వున్నది; కాని ఈకూలిపని అరుదుగా, ఉపక్రియగా, సహాయభూతంగా, తాత్కాలికదశగా మాత్రమే వుండేది. రోజు కూలివాడుగా అప్పుడప్పుడూ పనికి వెళ్లే వ్యవసాయకూలీకికూడా స్వంతభూమి కొంత వుంటూ వుండేది. అవుసరమైతే ఆతడు దానినుంచి తన జీవనమును సంపాదించుకొంటూ వుండేవాడు. వర్తక శ్రేణుల నిబంధనలు ఈనాటి ఉమేజువారీ రేపటిమేస్త్రీ అయ్యేటట్లుగా వుండేవి. కాని వుత్పత్తిసాధనాలు సామాజికమై, అవి కాపిటలిస్టుల చేతులలో కేంద్రీకరింపబడగానే, ఈపరిస్థితి మారింది. అల్పులగు వ్యక్తిగతవుత్పత్తిదారుల వుత్పత్తిసాధనాలు, దినుసులు కూడా అంతకంతకూ వాటివిలువను కోల్పోయినవి; ఆతడు కాపిటలిస్టువద్దకుపోయి, కూలికి పనిచేయుటతప్ప మరేగత్యంతరం లేకపోయింది. ఇంతవరకూ అరుదుగా వుపక్రియగావుండే కూలిపని యిప్పుడు వుత్పత్తియొక్క సూత్రంగా, మూలరూపంగాఅయింది; ఇంతవరకూ వుపక్రియగావున్నట్టిది ఇప్పుడు కార్మికుని ఒకేఒకవృత్తియైనది. అప్పుడప్పుడూ కూలికిపోయే

కూలిపనివాడు జీవితాంతం కూలిపనివాడుగా అయినాడు ఇదేసమయంలో జమీందారీవ్యవస్థ చితికిపోవటంవల్లనూ, భూములనుంచి రైతులు వెళ్ళగొట్టబడుటవల్లనూ, ఇట్టివే ఇతర కారణాలవల్లనూ జీవితాంతపుకూలిపనివారలసంఖ్య అపరిమితంగా పెరిగింది. కాపిటలిస్టుల చేతులలో కేంద్రీకరింపబడిన ఉత్పత్తిసాధనాలు ఒకప్రక్కను, ఇప్పుడు తమ శ్రమశక్తిని మినహా మరేయితర ఆస్తినికల్గివుండని వుత్పత్తిదారులు మరొకప్రక్కన వుండి ఒకదానినుంచి మరొకటి దూరంచేయబడటం పరిపూర్తి అయింది. సామాజికోత్పత్తి, కాపిటలిస్టు భుక్తముల వైరుధ్యం, బూర్జువావర్గము, శ్రామికవర్గముల మధ్య వైషమ్యంగా బహిర్గతమైనది.

తమదినుసుల మారకంద్వారా సామాజిక సంయోగముగల్గిన వ్యక్తిగతవుత్పత్తిదారుల సమాజంలోనికి, సరుకుల వుత్పత్తిదారుల సమాజంలోనికి కాపిటలిస్టు వుత్పత్తిపద్ధతి తోసుకొని వచ్చినదని చూశాము. కాని సరకులవుత్పత్తి విధానంపై ఆధారపడిన ప్రతి సమాజవ్యవస్థలోనూ ఒక ప్రత్యేకలక్షణం గోచరిస్తుంది. వీటిలో వుత్పత్తిదారులు తమ సామాజికసంబంధాలపై కంట్రోలను పూర్తిగా పోగొట్టుకుంటారు. ప్రతివుత్పత్తిదారుడూ తనకుతానే, తనకులభ్యమైన వుత్పత్తిపరికరాల సహాయంతో, మారకంద్వారా తన వ్యక్తిగత వాంఛలను తీర్చుకొనేవుద్దేశంతో వుత్పత్తిని గావిస్తూవుంటాడు. కాని తాను వుత్పత్తిగావించే వస్తువుల మొత్తంలో ఎంతమార్కెటుకు వస్తుందో, సరుకుకు ఎంతగిరాకీ (demand) వున్నదో, ఏ వుత్పత్తిదారునకూ తెలియదు. తనసరుకు నిజంగా అమ్ముడు

పోయే సరుకే అవునా, కాదా, తన వుత్పత్తిఖర్చులైనా గిట్టు తాయా, లేదా, అసలు తన సరుకు అమ్మకము అవుతుందా, లేదా; ఇందులో ఏదీ, ఏ వుత్పత్తిదారునకూ తెలియదు. సామాజికోత్పత్తిలో అరాజకం ప్రబలిఉంటుంది. కాని, ఇతర వుత్పత్తి విధానములకువలెనే సరుకుల వుత్పత్తివిధానమునకు కూడా, దానిలోనే అంతర్భూతంగావుంటూ, విడదీయరాని కొన్ని స్వంతసూత్రములు వున్నవి: ఈ సూత్రాలు, ఉత్పత్తిలో వుండే అరాజకములెక్క లేకుండానే, అరాజకము ద్వారానే, బహిర్గతము అవుతూ వుంటాయి. మారక విధానంలోవుంటూ వ్యక్తిగత వుత్పత్తిదారులమధ్య తప్పనిసరియగు పోటీగావుండే, సామాజిక సంబంధాల ఏకైకరూపంగా ఈసూత్రాలు ప్రత్యక్ష మౌతాయి. కాబట్టి, మొట్టమొదటిలో ఇవి, వుత్పత్తిదారు లకుకూడా కనపడకుండావుండి, దీర్ఘానుభవంద్వారాగాని కనుగొనబడవు. కాబట్టి వుత్పత్తిదారులతో సంబంధ లేకుం డానే, వుత్పత్తిదారులకు వ్యతిరేకంగానే, గ్రుడ్డిగా పనిజేసే వుత్పత్తివిధానం యొక్క సహజసూత్రాలుగా అవి స్థిరపడగలవు. ఉత్పత్తిదినుసులే ఉత్పత్తిదార్లను ఏలుతూ వుంటాయి.

---

మధ్యయుగాలనాటి సమాజంలో, ముఖ్యముగా ఆకా లంప్రారంభములో వుత్పత్తి, ప్రధానంగా వుత్పత్తిదారుల స్వంత వుపయోగమునకే జరుగుతూవుండేది. చాలావరకూ ఉత్పత్తిదారునియొక్క, ఆతని కుటుంబముయొక్క అవుసరము లను సంతృప్తిపర్చుటయే దాని లక్ష్యము. ఒకరిపై ఆధారపడి జీవించే సందర్భాలలో, జమీందారీ ప్రభువర్గముయొక్క అవుసరములనుకూడా సంతృప్తిపర్చుటకుకూడా వినియోగ

పడుతూ వుండేది. ఇందులో మారకం ఏమీ లేదు. కాబట్టి దినుసులు సరుకులస్వభావాన్ని పొందలేదు. పాత్రసామగ్రి, తిండి, బట్టలు, తనకు అవుసరమగు సమస్త వస్తువులనూ రైతు కుటుంబమే వుత్పత్తి గావించుకొనేది. ఎప్పుడైతే తన అవసరములకూ, జమీందార్ ప్రభువులకు వస్తురూపంలో చెల్లించవలసిన మొత్తములకూ, మించి అదనంగా ఉత్పత్తిగావించ ప్రారంభించినదో అట్టిదశలోనే అదిసరుకులను ఉత్పత్తి జేయటం ప్రారంభమైనది. ఇట్టి అదనపుదినుసులు, సామాజిక మారకంద్వారా అమ్మకమునకై తేబడగానే, అవి సరుకులుగా మారినవి. పట్టణాలలోవుండే శిల్పులు మొట్టమొదటినుండీ మారకంకొరకే వస్తువుల నుత్పత్తిగావించుచున్నారనేమాటనిజమే; కాని వారుకూడా తమ అవుసరాలలో ఎక్కువభాగం తామే వుత్పత్తిగావించుకొనేవారు. వారికి తోటలు, చిన్నచిన్నపొలాలు వుండేవి; వారిపశువులను సాముదాయకబీళ్ళలో మేతకు పంపేవారు; సాముదాయక అడవులనుండి కలప, కట్టె మున్నగువాటిని తెచ్చుకొనేవారు. స్త్రీలు నార, తాడు, వూలుమున్నగువాటిని పేనేవారు. మారకంకొరకే వుత్పత్తిచేయుపద్ధతి, సరుకు నుత్పత్తి జేయుపద్ధతి అపుడు చాలాశైశవావస్థలో వుండేది. కాబట్టి మితమగుమారకం, మితమగు మార్కెట్టు, నిలకడమైన వుత్పత్తిపద్ధతి, బాహ్యప్రపంచంతో సంబంధంలేని ఏకాంతవాసము, స్థానికంగా సమిష్టిజీవనం, ఇది ఆనాటి జీవనక్రమం గ్రామంలో మార్కు, * పట్టణంలో వర్తకశ్రేణి.

అయినప్పటికీ సరకుల వుత్పత్తివిధానం విస్తరించిన

* మార్కు అనగా జర్మనీలోని గ్రామపంచాయతి.

కొలదీ, ముఖ్యంగా కాపిటలిస్టు వుత్పత్తివిధానం వ్యాప్తిచెందిన కొలదీ, ఇంతవరకూ లోలోన అణగివున్న సరుకులవుత్పత్తి విధానంసూత్రాలు అంతకంతకూ ఎక్కువ బహిరంగంగా బలీయంగా పనిచేయ ప్రారంభించినవి పాత బంధములన్నీ సడలినవి; పాత విభాగములన్నీ భగ్నం కాబడినవి; ఉత్పత్తిదారులంతకంతకూ స్వతంత్రులైన, ఒంటరియైన, సరుకుల వుత్పత్తిదారులుగా మారసాగారు సామాజికోత్పత్తిలోవున్న అరాజకం అంతకంతకూ స్పష్టమై, అంతకంతకూ అతిశయించినది. కాని సామాజికోత్పత్తిలో ఏర్పడిన ఈఅరాజకం,పూర్తిగా అరాజకానికి విరుద్ధమైనట్టి మార్గంద్వారానే, కాపిటలిస్టువుత్పత్తి విధానంలో మరింత తీవ్రరూపాన్ని దాల్చినది. వేర్వేరుఅయిన ప్రతిఒక్కవుత్పత్తి కేంద్రంలోనూ వుత్పత్తి ఈ అంతకంతకూ ఎక్కువగా సామాజికంగా ఏర్పాటు కాబడుటయే ఈ మార్గం. వుత్పత్తిలోవుండే వెనుకటి నిశ్చలత్వము సామాజికోత్పత్తిఅనే లివరుసాధనంతో అంతమొందించబడినది. ఏపారిశ్రామికరంగంలో ఇది ప్రవేశించబడుతే ఆరంగంలో, దీనితోబాటు ఇక వెనుకటి వుత్పత్తివిధానం సాగగలేదికాదు; ఎక్కడ ఏచేతిపనిలో ఇది ప్రవేశిస్తే ఇక చేతిపని నాశనమయ్యేది. కృషిరంగం యుద్ధరంగమైనది. నూతన దేశముల పరీక్షణము (కనుగొనుట discovery) * అందుమూలకంగా వాటికి వలస బోవుటద్వారా

* 15 వ శతాబ్దం వుత్తరభాగంలోనూ, 16 వ శతాబ్దం పూర్వభాగంలోనూ ఈనూతనదేశముల పరీక్షణం జరిగింది. 1492లో కొలంబస్ అమెరికాను కనిపెట్టటమూ, 1498లో వాస్కోడిగామా భారతదేశమునకు సముద్రమార్గమును కనిపెట్టటమూ వీటిలోబహుముఖ్యమైనవి. (అనువాదకుడు)

మార్కెట్లు వృద్ధియై, చేతిపరిశ్రమలు పరిశ్రమలుగా మారుట త్వరితమైనది. స్థానిక వ్యక్తిగతవుత్పత్తిదారుల మధ్యనేకాను పోరాటములు ప్రారంభమైనవి; స్థానిక పోరాటములు జాతీయ పోరాటములుగా 17,18 శతాబ్దముల వాణిజ్య యుద్ధములుగా మారినవి *చివరకుభారీపరిశ్రమలువృద్ధిగావటంప్రపంచమంతా మార్కెటుగా సృష్టిగావటంవల్ల ఈ పోరాటం విశ్వవ్యాప్తమై అదే సమయంలో అతి తీవ్రమగు రూపాన్నిదాల్చినది. ఉత్పత్తిలో వుండే స్వాభావిక పరిస్థితులలోగాని, కల్పిత పరిస్థితుల లోగాని వున్న అనుకూలతనుబట్టి వ్యక్తిగత కాపిటలిస్టుల యొక్క, ఇదేవిధంగా మొత్తం పరిశ్రమలయొక్క మొత్తం దేశ ములయొక్క జీవన్మరణములు నిర్ణయింపబడుచున్నవి. ఓడిపోయినవాడు నిర్దయంగా బైటికి గెంటివేయబడుచున్నాడు. వ్యక్తుల జీవన సంగ్రామమను డార్విన్ సిద్ధాంతము • ప్రకృతినుంచి

* భారతదేశమూ, అమెరికాలతో జరిగే వాణిజ్యమును హస్తగతం గావించుకొనుటకూ, వాటిని వలసదేశాలుగా జేసుకొని దోచుటకూ 17, 18 శతాబ్దములలో స్పెయిన్, పోర్చుగల్, హాలండు, ఫ్రాంసు, ఇంగ్లాండు దేశాల మధ్య తీవ్రయుద్ధాలు జరిగినవి. ఈ యుద్ధాలలో చివరకు ఇంగ్లాండు విజయమందినది. 18వ శతాబ్దమునకు ఇంగ్లాండు ప్రపంచవాణిజ్యమంతటిపై పెత్తనమును సంపాదించినది. ఈ యుద్ధాలనే వాణిజ్యయుద్ధాలంటాము.

(అనువాదకుడు)

• డార్విన్ సిద్ధాంతప్రకారం ప్రాణుల పరిణామం ఈ కారణాలవల్ల జరుగుతుంది. (1) ఒకేరకపువర్గములలోని వ్యక్తులలో క్రిందితరములకు సంక్రమించే వ్యత్యాసములు ఉండుట (2) ఈ వ్యత్యాసములుగల ప్రాణులలో జీవనంకొరకై జరిగే సంగ్రామములో, వాటి జీవనపరిస్థితులకు అనుగుణ్యంగా తమ జీవితాలను మార్చుకొనగలునవే గెల్చుట; అనగా, బలవంతులే బ్రతుకగలుగుట (౩) ఈ జీవనసంగ్రామములో నిలబడగలుగుటకు వీలును గల్గించిన

సమాజమునకు అతి వేండ్రముతో వర్తించుటయే ప్రకృతిలోని పాశవికము (పశుదృష్టి) మానవసమాజాభివృద్ధిలో పరాకాష్టను చెందుటయే ఇది. సామాజికోత్పత్తి, కాపిటలిస్టు భుక్తము, ఈ రెండింటిమధ్య వున్న వైరుధ్యమే వ్యక్తిగత ఫాక్టరీలో వుత్పత్తి నిర్మాణయుతంగా జరగటం, మొత్తం సమాజంలో జరిగే వుత్పత్తిలో అరాజకం వ్యాపించటం అనే ప్రతియోగంగా పునరుత్పత్తియౌతుంది.

తన సహజ ప్రకృతిచేతనే ఈ వైరుధ్యములను (సామాజికోత్పత్తి, వ్యక్తిగతభుక్తం; ఒక్కొక్క ఫాక్టరీలో వుత్పత్తి నిర్మాణయుతం కావటం, మొత్తం సమాజం వుత్పత్తిలో అరాజకం ప్రబలి వుంటడం) కల్గి వుండి, ఫోరియరు ఎన్నడో చెప్పినట్లుగా, ఈ 'విషమచక్రం' నుండి బైటపడే ఆశ లేకుండా వున్న ఈ రెండు ప్రత్యక్షరూపాలలోనూ కాపిటలిస్టువిధానం తిరుగుతుంది. కాని ఫోరియర్ తన కాలంలో కనిపెట్టలేనిదేమిటంటే ఈ చక్రం అంతకంతకూ ఇరుకు అగుచున్నది. దీని గమనం శంఖాకృతి (మెలితిరుగుతూ పైకి పెన్నంగా పోవుట (Spiral) లో వుండి గ్రహాలగమనం వలెనే, చివరకు తన కేంద్రంతో ఢీకొనటంలో అంతమై తీరాలి. సామాజిక

---

ఈ వ్యత్యాసములు వంశపారంపర్యంగా మూడుతరములకు సంక్రమించి, జీవన సంగ్రామములో కల్గే అనుకూలవ్యత్యాసములు క్రమంగా పేరుకొనుట. "ఆర్థికవాదులు స్వేచ్ఛావ్యాపారపోటీని, జీవనసంగ్రామమునూ బ్రహ్మాండమగు చారిత్రిక విజయంగా భావిస్తారు. ఇవి జంతువర్గములో సామాన్యధర్మము నేది ఋజువుచేయుటంద్వారా, మానవజాతిపైనా, ముఖ్యంగా తనతోటి దేశీయుల మీద ఎట్టి ఘాటైన వ్యంగ్యకావ్యమును తాను వ్రాస్తున్నాడో డార్విన్ ఎరుగడు. - (ఎంగెల్సు, 'ప్రకృతియొక్క గతితార్కికవిధానం.')

వుత్పత్తిలో వుండే అరాజకమే శ్రామికులను తయారుచేయు తోడ్పుడుశక్తి: తిరిగి ఈ శ్రామికులే వుత్పత్తిలో వుండే అరాజకాన్ని చివరకు అంతం జేసేది. సామాజికోత్పత్తిలో వుండే అరాజకము యొక్క తోడ్పుడుశక్తి వల్లనే భారీపరిశ్రమలలో యంత్రములు అంతులేకుండా అభివృద్ధి అవుతూ వుంటాయి. ఇందువల్ల, ప్రతి పారిశ్రామిక కాపిటలిస్టూ, తాను నాశనం కాకుండా వుండాలంటే, తన యంత్రసామగ్రిని అంతకంతకూ పరిపూర్ణత చెందించవలసిన నిర్బంధమునకు లోనౌచున్నాడు. కాని యంత్రములను పరిపూర్ణత చెందించుట యంటే మానవశ్రమను అనావశ్యకం గావించుట యన్నమాట. యంత్రముల నెలకొల్పుట, వాటి నధికం జేయుటయంటేనే, వేలు లక్షలు చేతిపనివారలను తీసివేసి వారి స్థానే కొలదిమంది యంత్రాలయ కార్మికులను నియోగించుట: ఇటువంటప్పుడు యంత్రాభివృద్ధి యంటే ఈ యంత్రాలయ కార్మికులు అంతకంతకూ అధికంగా తీసివేయబడుట యన్నమాట. చివరకు నేను 1845 లో పేర్కొన్నట్లుగా, పూర్తి పారిశ్రామిక నిలవసైన్యం (industrial standing army శాశ్వతంగా నిరుద్యోగులైన కార్మికులు), కాపిటలిస్టు వర్గానికి అవసరమైన కార్మికుల సగటుసంఖ్యను మించి హాజరుగా వుండే అదనపుకార్మికులు, సృష్టింపబడటం జరుగుతుంది. ఈ నిల్వసైన్యం, పరిశ్రమలన్నీ పూర్తిశక్తితో పనిజేస్తూ వున్నప్పుడు అవుసరపడుతూ, ఆవ్యాపారవెల్లువ అంతరించగానే సంభవించే సంక్షోభంలో వీధిలోనికి గెంటివేయబడుతూ వుంటుంది. తమ జీవనంకొరకై కాపిటల్‌కు వ్యతిరేకంగా కార్మి

కులు జరిపే పోరాటంలో ఎల్లప్పుడూ వారి మెడలలో గుది బండగానూ, కాపిటలిస్టు అవుసరాలకు అనుకూలంగా వేతనాలను తక్కువ లెవెల్‌లో వుంచుట కుపయోగించే రెగ్యులేటర్ గానూ ఈ నిల్వసైన్యం వుంటూవుంటుంది. కాబట్టి, తేలేదేమిటంటే, మార్క్సుభాషలో, ఈయంత్రాలే, కార్మికవర్గానికి వ్యతిరేకంగా కాపిటలిస్టు వర్గం వుపయోగించే ఘోరఆయుధాలగు కృషిసాధనాలే, కార్మికుని చేతులనుండి అతని జీవనాధారములను ఎల్లప్పుడూ లాక్కుపోతూవుంటవి, కార్మికుని ఉత్పత్తియైన దినుసుయే అతని పరాధీనతకు సాధనమౌతుంది. కాబట్టి, మొదటినుండీ కృషి సాధనములు (వుత్పత్తి పరికరముల)ను మితవ్యయంగావించుటవల్ల, మొదటనుండీ శ్రామికశక్తినిపూర్తిగా, చిత్తంవచ్చినట్లుగా నిరుపయోగం గావించటం, పనిజేయుటకై అవసరమగు మామూలు పరిస్థితులను దోచుకొనటం సంభవిస్తుంది: "శ్రమకాలాన్ని బాగా తగ్గించుటకు మిక్కిలి శక్తివంతమగు యంత్రములే, కార్మికునీ, అతనికుటుంబాన్ని, వారిశ్రమకాలంయొక్క ప్రతిఒక్క నిముషమునూ కాపిటలిస్టుయొక్క కాపిటల్ విలువను పెంచుటకుగాను వినియోగించునట్లుగా జేస్తున్నవి."*

కాబట్టి కొందరు అమితశ్రమ ఇతరులకు నిరుద్యోగమును కల్గజేయు అవుసరపరిస్థితులను కల్గజేస్తున్నవి; కొత్త కొను గోలుదారులకొరకై ప్రపంచమంతటా వేటాడుతూతిరుగు భారి పరిశ్రమలవల్ల స్వదేశంలోని కార్మికులు తిండిలేక మలమల మాడి పోవునంతటి హీనస్థితిని గడుపుతూ వుంటారు; ఈ

* కాపిటల్ 'వాల్యూం' I

విధంగా భారీపరిశ్రమలు స్వీయదేశాంతర్గత మార్కెట్టును సంకుచితపరుస్తూవుంటవి. "ధనసంచయము (accumulation) పరిమాణము, శక్తి ఎంతపెరుగుతే అంత ఎక్కువగా పారిశ్రామిక నిల్వసైన్యం, అనగా అదనపు కార్మికుల నిల్వసంఖ్య, పెరుగుతూవుంటూ దానితోబాటు పెరుగుతూవుంటుంది. ఈ సూత్రమే, ప్రామీథియస్‌ను కొండకు బంధించుటకై వల్కన్ ప్రయోగించిన మేకులకన్న దృఢమైన మేకులతో కార్మికుని కాపిటల్‌కు బంధించివేస్తున్నది. కాపిటల్ ఎంత పేరుకొంటున్నదో అంతగా దుస్థితికూడా పేరుకొంటున్నది. ఒక ధృవమున సంపత్సంచయము జరుగుచూ వున్నదంటే మరోధృవమున దుస్థితి 'అధికశ్రమబాధ, బానిసత్వం, అజ్ఞానం, కర్కశత్వం, మానసికపతనం అధికమౌతూ వుంటాయి; అంటే, తన స్వంతదినుసులను కాపిటల్ రూపంలో వుత్పత్తిగావించే వర్గం (కాపిటల్‌కు మార్క్సు ఇచ్చిన క్లాసికల్ వ్యుత్పత్తి అర్థమునుచూడగోరాను – అనువాదకుడు) వీటన్నిటినీ పొందుతూ వుండటం జరుగుతుంది.'* కాపిటలిస్టు వుత్పత్తి విధానంనుండి ఇట్టి పంపకంకన్న ఇతరమును ఆశించుటఅంటే, బాటరీతో ఎలక్ట్రోడ్‌లు స్పర్శిస్తున్నప్పుడు, నీటిలోని మూల పదార్థములను విడదీయకుండా, ధనధృవమువైపున ఆమ్లజని ఋణధృవమువైపున ఉదజని కల్గజేయబడదని ఆశించుటయే.

ఆధునిక యంత్రీములు పరిపూర్ణతనొందుట అత్యున్నత దశనొందినకొలది, సమాజంలోని వుత్పత్తిలోవున్న అరాజకంమూలకంగా, ప్రతిఒక్క పారిశ్రామికాధిపతీ తనయంత్ర

---

* కాపిటల్, పేజీ 709 (అనువాదకుడు)

ముల నెల్లప్పుడూ తప్పనిసరిగా అభివృద్ధిపర్చుతూ వుండటం, సర్వదా వాటి వుత్పత్తిశక్తిని అధికంజేస్తూ వుండటం మనం జూసాము. తన వుత్పత్తిరంగమును పెంచవచ్చుననే వాస్తవిక అవకాశమే ఆతనికి అనుల్లంఘనీయమగు విధిగా ఏర్పడుచున్నది. గాస్ యొక్క విస్తరణశక్తి దేనిముందు పిల్లలఆటగా కన్పిస్తోందో అట్టి భారీపరిశ్రమల విపరీత విస్తారశక్తి తన్ను అదిమివుంచు ప్రతీఘాతశక్తులను పరిహసించుతూ పరిమాణం లోనూ, గుణంలోనూకూడా విస్తరించుట అవుసరమగు చున్న విషయం మనకు కన్పిస్తుంద. ప్రజలు పెట్టగల్గేఖర్చు, అమ్మకము, భారీపరిశ్రమల వుత్పత్తి, వస్తువులకు లభ్యమయ్యే మార్కెటులు వీటినిబట్టియే ప్రతీఘాతశక్తుల ఒత్తిడి ఏర్పడుతుంది. కాని వుత్పత్తిశక్తులవలెనే మార్కెటుకూడా పరిణామంలోనూ, తీవ్రతలోనూ విస్తరించాలంటే దానికున్న సామర్థ్యం, ఇతరసూత్రాల ప్రకారం—ఈసూత్రాలు చాలా బలహీనమైనట్టివి—నిర్ణయింపబడు చున్నది. ఉత్పత్తిపెంపుదలను మార్కెటుపెంపుదల అందుకోలేదు. ఒకదానితో ఒకటి ఢీకొనటం తప్పదు; కాపిటలిస్టు వుత్పత్తివిధానం బద్దలు కానంతకాలం దీనికి మరొక పరిష్కారమార్గం వుండదు; గనుక ఈఢీకొనటం నియమితకాలవ్యవధిలో సంభవిస్తూ వుంటుంది. కాపిటలిస్టు వుత్పత్తివిధానం మరొకనూతన 'విషమ చక్రమును' పుట్టిస్తుంది.

నిజానికి, 1825లో మొట్టమొదటగా జనరల్ సంక్షోభము కల్గినప్పటినుండీ మొత్తం పారిశ్రామిక వాణిజ్యప్రపంచాలూ, నాగరిక ప్రజలందరియొక్క, కొద్దోగొప్పో అనాగరికు

లగు వారి పరివారముయొక్క వుత్పత్తి మారకములూ, దాదాపు ప్రతి 10 ఏండ్లకూ తారుమారు అవుచున్నవి. వర్తకం స్తంభించి పోతుంది; మార్కెటు సరుకులచే అమితంగా కూర బడివుంటుంది. అమ్మకం లేక సరుకులు కుప్పతిప్పలుగా పడి వుంటాయి; హాజరుధనం అదృశ్యమౌతుంది; పరపతి నశిస్తుంది; ఫాక్టరీలు పనిలేకుండా పడివుంటాయి; తాము జీవనాధార ములను అతివిస్తారంగా వుత్పత్తిజేసియుండుట మూలకంగానే కార్మికులు జీవనాధారములకు కొరతపడివుంటారు. దివాళా మీద దివాళా, బలవంతపు అమ్మకంమీద బలవంతపు అమ్మకం సంభవిస్తాయి. ఈఆర్థికమాంద్యము చాలా ఏండ్లు వుంటుంది; ఉత్పత్తిశక్తులు, వుత్పత్తి వస్తువులుకూడా విస్తారంగా నాశనం జేయబడుతవి; ఇదంతా కొద్దోగొప్పో హీన ధరలకు నిల్వవున్న సరుకులన్నీ అమ్ముడుపోయేవరకూ, వుత్పత్తి మారకములు క్రమంగా, మెల్లిగా మరలసాగుట ప్రారంభ మౌనంతవరకూ, వుంటుంది. మెట్లుమెట్లుగా ఈనడక చురుకౌ తుంది; చురుకునడక హుటాహుటి నడకలోనికి మారుతుంది; ఈపారిశ్రామిక హుటాహుటి నడక పరుగులోనికి మారుతుంది; పరుగు పారిశ్రామిక, వాణిజ్య, క్రెడిట్ (పరపతి) స్పెక్యు లేషన్ రంగాల పందెపుపరుగుగా మారుతుంది: ఈవిధంగా పరుగెత్తి పరుగెత్తి, అనేక ప్రమాదకరమగు అగడ్తలను గెంతిగెంతి, చివరకు ఒక్కసారిగా అగాధంలో కూలిపోతుంది. తిరిగి మళ్ళీ ఇదే వరుస. 1825 నుండి ఇప్పటికి మనం 5 సార్లు దీనిని చూసాము: తిరిగి ఇప్పుడు (1877 లో) ఆరవపర్యా యం మనం దీనిని అనుభవిస్తున్నాము. ఈ సంక్షోభంయొక్క

స్వభావం ఎంత సూటిగా కన్పించుచున్నదంటే ఇదివరకే దీనిని 'అమితంలో కరువు' అని పిల్చారు.

ఈ సంక్షోభములలో సామాజికోత్పత్తికీ, కాపిటలిస్టు భుక్తానికీ మధ్యగల వైరుధ్యం బహు వుగ్రంగా ప్రేలి పగులుతుంది. తాత్కాలికంగా సరుకుల చలామణీ దాదాపు లేనట్లే అవుతుంది. సరుకుల వుత్పత్తిసూత్రాలు, సరుకుల చలామణీ సూత్రాలు, అన్నీ తల్లక్రిందులౌతాయి. ఆర్థికసంఘట్టనము (ఢీకొనటం) దాని వుచ్చదశకు జేరుకొంటుంది. ఉత్పత్తివిధానము మారకవిధానమునకు ఎదురు తిరుగుతుంది.

ఒక్కొక్క ఫాక్టరీలో సామాజికోత్పత్తి నిర్మాణం ఎంతగా అభివృద్ధిజెందినదంటే అది, సమాజంలో, సామాజికోత్పత్తిగా వుంటూనే, దానికతీతంగా వుంటుంది. ఫాక్టరీలో సామాజికోత్పత్తి నిర్మాణమునకూ, వుత్పత్తి అరాజకత్వమునకూ ఇక ఎంతమాత్రం పొసగదు. సంక్షోభకాలంలో చాలామంది పెద్ద కాపిటలిస్టులూ, అంతకన్న ఎక్కువమంది చిన్న కాపిటలిస్టులూ వినాశనం కావటం మూలకంగా అతితీవ్రంగా కాపిటల్ కేంద్రీకరణ జరుగుతూ వుంటుంది. ఇందుమూలకంగా, ఫాక్టరీలో సామాజికోత్పత్తి నిర్మాణమునకూ, వుత్పత్తిలోని అరాజకమునకూ ఇక ఎంతమాత్రం పొసగదనే విషయం కాపిటలిస్టులకే స్పష్టపడింది. కాపిటలిస్టు వుత్పత్తివిధానం యొక్క యంత్రమంతా, దానివల్లనే సృష్టింపబడిన వుత్పత్తిశక్తుల భారంవల్ల భగ్నమైపోతుంది. ఈ వుత్పత్తిసాధనముల మొత్తము నంతా కాపిటల్ క్రింద మార్చుట ఇంక అసాధ్యమౌతుంది ; అవన్నీ పని లేకుండా పడివుంటాయి ; ఇందువల్లనే

పారిశ్రామిక నిల్వసైన్యంకూడా పనిలేకుండా పడివుంటుంది. ఉత్పత్తిసాధనాలు, జీవనసాధనాలు, హాజరు కార్మికులు; ఉత్పత్తికీ, జనరల్ సంపదకూ అవసరమగు ద్రవ్యములన్నీ కొల్లలుగా పడివుంటాయి. కాని "అమితమే దుస్థితికీ, లేమికీ, మూలమౌతుంది." (ఫొరియర్); కారణమేమిటంటే, అమితత్వంవల్లనే ఉత్పత్తిసాధనాలు (means of Production) జీవన సాధనాలు, (means of subsistensce) కాపిటల్‌గా మారుటకు వీలులేకుండాపోతున్నది. ఎందుచేతననగా, తాము ముందుగా కాపిటల్‌గా మార్చబడకుండా, మానవ శ్రమశక్తిని దోచుకొనే సాధనాలుగా మార్చబడకుండా, ఉత్పత్తిసాధనాలు పని చేయటం ప్రారంభించవు. ఉత్పత్తిసాధనాలు, జీవనసాధనాలు కాపిటల్‌రూపాన్ని పొందవలసిన అవసరమే వాటికీ, కార్మికులకూ మధ్య పెనుభూతంగా నిల్చివున్నది. ఉత్పత్తియొక్క ఉపకరణముల లివర్లూ, (meterial levers) మానుషలీవర్లూ (Personal levers) దగ్గరకు జేరకుండా ఆటంకం పెట్టేదీఇదే; ఉత్పత్తి సాధనాలు పనిజేయకుండాను, కార్మికులు పనిజేయకుండాను, వారు తమ జీవనమును సంపాదించుకొనకుండాను అడ్డుపడేది ఇదే; ఈ విధంగా, ఒకవైపున, ఇకెంతమాత్రమూ ఈ వుత్పత్తి శక్తులను అదుపులో వుంచుకోలేని అసమర్థతను ప్రదర్శిస్తూ వుంటుంది. మరొక వైపున, తమలోని వైరుధ్యాలను అంతంగావించుటకూ, కాపిటల్‌గా తమకున్న స్వభావాన్ని పోగొట్టుకొనుటకూ, సామాజిక వుత్పత్తిశక్తులుగా తమస్వభావాన్ని వాస్తవంగా రుజువు చేసుకొనుటకూ ఈ వుత్పత్తిశక్తులు అంతకంతకు ఎక్కువబలంతో ముందుకు తోసుకు వస్తువుంటాయి.

ఉత్పత్తి శక్తులీవిధంగా అమితంగా పెరుగుతూవుండే కాలంలో, తమకుండే కాపిటల్ స్వభావానికి ఎదురుతిరుగుతూ వుండటంమూలాన, తమసామాజిక స్వభావాన్ని అంతకంత కెక్కువగా గుర్తింపబడేలాగున చేయటంమూలాన, కాపిటలిస్టు సంబంధాల ఆవరణలో సాధ్యమైనంతవరకూ, కాపిటలిస్టు వర్గంకూడా ఈ వుత్పత్తి శక్తుల సామాజిక స్వభావాన్ని అంత కంతకూ ఎక్కువగా గుర్తించవలసివస్తుంది. విపరీతమగు క్రెడిట్ ముమ్మరంతోవుంటే పారిశ్రామిక అమితోత్పత్తి కాలంలో, అటుపిమ్మట గభీలున వచ్చే సంక్షోభంలో అనేక గొప్ప కాపిటలిస్టు సంస్థలు పతనమైపోవటం మూల కంగాను (గొప్పపారిశ్రామిక సంస్థల మొత్తాలు) వివిధ రకాల జాయంటు స్టాకు కంపెనీలుగా మనకుకన్పించే పోష లిస్టురూపాన్ని పొందటం త్వరితగతిని జరుగుతుంది. ఉత్పత్తి రవాణా సాధనాలు ప్రథమంనుండే ఎంత బ్రహ్మాండ పరి మాణం గలవంటే, ఉదాహరణకు రైల్వేలవంటి వెంతపెద్ద వంటే, అవి ఇతర కాపిటలిస్టు దోపిడీరూపాల కన్నిటికీ అతీతమైనవి. అభివృద్ధియొక్క ఒకానొకదశలో ఈ రూపం కూడా సరిపోదు; ఒకేదేశంలో, ఒకేరకం పరిశ్రమలో వున్న భారీపారిశ్రామికాధిపతులందరూ జేరి వుత్పత్తిని క్రమ పద్ధతులలో నడుపుటకై సమితిగాఏర్పడి, 'ట్రస్టు'ను ఏర్పాటు జేస్తారు. ఎంతవుత్పత్తిగావాలో వారునిర్ణయిస్తారు; వారిలోవారు దానిని పంచుకొంటారు; ఆవిధంగా ముందుగానే నిర్ణయించిన అమ్మకంధరకు అంటగట్టుతారు. కానివ్యాపారం దెబ్బతినగానే, సామాన్యంగా ఈట్రస్టులన్నీ విచ్ఛిన్నమైపోతాయి; కనుక

ఇందువల్లనే అవి ఇంకా ఎక్కువగా కేంద్రీకరింపబడిన సాంఘిక రూపాన్ని పొందగలవు. ఒక పరిశ్రమ రంగమంతా ఒకే గొప్ప జాయింటుస్టాకు కంపెనీగా ఏర్పడుతుంది. స్వదేశంలోవుండే పోటీబదులు ఈఒక్క కంపెనీకి స్వదేశంలోపల గుత్తాధికారం ఏర్పడుతుంది; ఈవిధంగా, 1890 నాటికే ఇంగ్లాండులోని క్షారం (ఆల్కాలీ) వుత్పత్తి అంతా కేంద్రీకరింపబడింది; ఈవుత్పత్తి నిగావించే 48 పెద్ద కర్మాగారాలు కలిసిపోయి, ఒకే పెద్ద కంపెనీగా ఏర్పడి, ఏకరూపమగు కంట్రోలును కలిగివుంటూ, 12,00,00,000 మార్కుల కాపిటల్‌ను కలిగివున్నది.

ట్రస్టులలో స్వేచ్ఛావ్యాపార పోటీ దానికి వ్యతిరేకమగు గుత్తవ్యాపారంగా మారుతుంది. * అంతకంతకూ

---

* కాపిటలిజం చరమదశయగు సామ్రాజ్యవాదంలోని ప్రధాన లక్షణం గుత్తవ్యాపార సంస్థలుండటమేనని లెనిన్ మార్క్సిస్టు సిద్ధాంతాన్ని వివరిస్తూ తెలియజేసాడు:

"కాపిటలిజంలో సర్వసామాన్యంగావున్న లక్షణముల అభివృద్ధియే, అవి మరింత ముందుకు సాగటమే, సామ్రాజ్యవాదము. అయితే ఈ మూల లక్షణాలలోని కొన్ని లక్షణాలు తమ ప్రకృతులకు పూర్తిగా భిన్నమైన ప్రకృతులకు మారినప్పుడు, కాపిటలిజంనుండి మరొక ఉన్నతమైన సామాజిక ఆర్థికవ్యవస్థకు మారుతూవుండే దశయొక్క లక్షణాల రూపమును ధరించి, పొడుగునా తమ అస్తిత్వాన్ని బహిరంగతం చేస్తూవుంటాయి. ఇట్టి దశలోనే, కాపిటలిజం దానియొక్క ఒక నిర్ణీతమైన, ఉచ్ఛమైన దశలోనే కాపిటలిస్టు సామ్రాజ్యవాదంగా మారుతుంది. ఆర్థికరీత్యాచూస్తే, కాపిటలిస్టు స్వేచ్ఛావాణిజ్య పోటీబదులు కాపిటలిస్టు గుత్తవ్యాపారం ఏర్పడుతుంది. కాపిటలిజంయొక్క సర్వసాధారణంగా, సరుకుల వుత్పత్తి విధానంయొక్క – ప్రధాన లక్షణం స్వేచ్ఛావ్యాపారం; దీనికి పూర్తిగా వ్యతిరేకమైనది గుత్తవ్యాపారం; కాని మన కళ్ళఎదుటనే స్వేచ్ఛావ్యాపారం గుత్తవ్యాపారంగా మారి, స్వల్ప

తీసుకువస్తున్న సోషలిస్టు క్రమ వుత్పత్తి విధానమునకు ప్లానులేని కాపిటలిస్టు వుత్పత్తివిధానం దాసోహమంటుంది. తప్పకుండా ఇది (గుత్త వ్యాపారం) ఇప్పటికీ, మొదట్లో కాపిటలిస్టుల ప్రయోజనమునకే, అనుకూలతకే వినియోగ పడుతుంది. కాని ఈ సందర్భంలో దోపిడి ఎంత స్పష్టంగా కన్పిస్తుందంటే, ఇక అది భగ్నమై తీరవలసినదే. ఇంత బహిరంగంగా కొలది మంది దళారీలు (కూపనుక్లిప్పర్లు) మొత్తం సమాజమునంతటినీ దోచుకుంటూవుండే ట్రస్టుల వుత్పత్తివిధానమును జాతి సహించి వూరుకొనదు.

ఏదోఒక విధంగా, ట్రస్టులున్నా, లేకపోయినా కాపిటలిస్టుసమాజంయొక్క అధికార ప్రతినిధియగు రాజ్యాంగయంత్రం (ప్రభుత్వం, స్టేటు) ఉత్పత్తి మేనేజిమెంటును తీసుకొనక

---

పరిశ్రమలను నాశనంగావిస్తూ, భారీపరిశ్రమలను స్థాపిస్తూ, ఈ భారీ పరిశ్రమల స్థానే బ్రహ్మాండమగు భారీ పరిశ్రమలను తెచ్చిపెడుతూవుంటుంది; చివరకు వుత్పత్తి, కాపిటల్ ఎంతగా కేంద్రీకరింపబడుతవంటే గుత్తవ్యాపారసంస్థలే ఏర్పడినవి; ఏర్పడుతేవికూడా; కార్టెల్సు, సిండికేట్లు, ట్రస్టులు, వీటిలో, కోట్ల ధనాన్ని తిప్పుతూవుండే బ్రహ్మాండమగు బ్యాంకుల కాపిటల్ లీనమవటం సంభవిస్తుంది. ఇదే సమయంలో, స్వేచ్ఛావ్యాపార పోటీనుండి వుద్భవించిన గుత్తవ్యాపారం, స్వేచ్ఛావ్యాపార పోటీని పూర్తిగా రద్దుజేయక, దాని సరసనే వుంటూ, దానికి పైగావుంటూ, ఇందుమూలకంగా, తీవ్రములగు వైరుధ్యములకు, విభేదములకు, సంఘర్షణలకు కారణమౌతుంది.

(లెనిన్, "సామ్రాజ్యవాదం : కాపిటలిజంయొక్క ఉచ్ఛదశ" అనే గ్రంథంనుండి.)

(అనువాదకుడు)

తప్పదు. * ఈవిధంగా ప్రభుత్వఆస్తిగా తయారు చేయవలసిన అవసరం మొట్టమొదటగా రవాణాకు వినియోగపడే పెద్ద సంస్థలలో – పోస్టల్ సర్వీసు, టెలిగ్రాఫ్ సర్వీసు, రైల్వేలలో – కనిపిస్తుంది.

---

* నేను 'తప్పదు' అని అంటున్నాను. ఉత్పత్తి, రవాణా, సాధనాలు పేరు కంపెనీల మేనేజిమెంటుకు వాస్తవంగా మించి పెరిగినప్పుడు ఆర్థిక కదృష్ట్యా ప్రభుత్వమునకు వాటి బదిలీ తప్పనిసరియగునప్పుడు, ఈనాటి ప్రభుత్వంవంటి ప్రభుత్వమునకైనాసరే బదిలీయగుట, పెద్ద ఆర్థిక పురోభివృద్ధియే; ఉత్పత్తిశక్తుల నన్నింటినీ సమాజమే స్వాధీనపర్చుకుంటానికి ఇది ముందు మెట్టు. అయితే, ఈమధ్య, ప్రభుత్వ స్వామ్యములగూర్చి బిస్మార్కు ఎక్కువ శ్రద్ధను కనపర్చినపిమ్మట ఒకరకమైన కృత్రిమసోషలిజం —— ఇక్కడా అక్కడా గులాము స్వభావంగా దిగజారిన సోషలిజం_బయలు దేరింది. అన్నిటినీ ప్రభుత్వం _బిస్మార్కు ప్రభుత్వంవంటిదైనాసరే – తీసుకొనటమే సోషలిస్టు పద్ధతియని చెప్పుతుంది ఈసోషలిజం. అయితే, పుగాకువ్యాపారము నంతటినీ ప్రభుత్వమే వశపర్చుకొనుటయే సోషలిజమైతే, నెపోలియన్, మాటర్ నిక్కులు సోషలిస్టు సిద్ధాంతిజనకులుగా పరిగణింపబడుతారు. బెల్జియం ప్రభుత్వం, తన స్వంత ఆర్థిక, రాజకీయ కారణాలవల్ల తన రైల్వేలను తానే నిర్మిస్తే, ప్రష్యాలో వున్న ప్రధాన రైల్వేలైనులను, అవి యుద్ధానికి బాగా ఉపకరించేటందుకు గాను, రైల్వేవుద్యోగుల నందరినీ ప్రభుత్వానికి ఓట్లనిచ్చే మందలుగా తయారు చేయుటకుగాను, పార్లమెంటు ఓటుతో సంబంధం లేకుండా స్వతంత్రంగా ఆదాయమును సంపాదించుకొనుటకుగాను మాత్రమే, బిస్మార్కు ప్రభుత్వ స్వాధీనములు గావిస్తే, ఇట్టి చర్యలు ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని చైతన్యపూరితంగాగాని, అజ్ఞానజన్యంగాగాని అగు సోషలిజం ఎన్నడూ కానేరదు. లేనిచో, రాయల్ మారిటైం కంపెనీ, రాయల్ పోర్సిలెన్ మాన్యుఫాక్చరు, మిలిటరీ టైలర్సు యూనియన్, ఇవన్నీ సోషలిస్టుసంస్థలే అయివుండాలి. లేదా, 1830 నాటి ఒక జిత్తులమారికుక్క చెప్పినట్లుగా, 3వ ఫ్రెడరిక్ విలియం పరిపాలన కాలంలో, ప్రభుత్వంచే వేశ్యాగృహాలను స్వాధీనంచేసుకొని నడుపుటకూడా సోషలిజమే అవుతుంది. (ఎంగెల్సు షరా)

నవీన వుత్పత్తిశక్తులను బూర్జువావర్గం కంట్రోలుచేయ లేకపోవుచున్నదని ఆర్థికసంక్షోభంద్వారా తెలియవస్తే, బ్రహ్మాండమగు ఉత్పత్తి, రవాణా పరికరాలు మొత్తాలు జాయింటు స్టాకుకంపెనీలుగాను, ట్రస్టులుగాను, ప్రభుత్వఆస్తిగాను మారటంవల్ల, వీటికి సంబంధించినంతవరకూ బూర్జువా వర్గానికి స్వస్తిచెప్పవచ్చునని తెలియుచున్నది. కాపిటలిస్టులు గావించే సామాజికకర్తవ్యము లన్నిటినీ ఇప్పుడు వుద్యోగులే చేస్తున్నారు. కాపిటలిస్టులు ఇప్పుడు గావించే పనియంతా, వచ్చే ఆదాయాన్ని జేబులలో వేసుకొనటం, కూపన్లపై సంత కాలిడటం, కాపిటలిస్టులలో ఒకరి కాపిటల్ నొకరు కాజేసే స్టాక్ఎక్ఛేంజిలో జూదమాడటం మాత్రమే తప్ప; వీరికి మరొక సామాజికకర్తవ్యమేలేదు. మొదటగా, కాపిటలిస్టు ఉత్పత్తి విధానం వచ్చి కార్మికులను (స్వయంగా కష్టపడి వుత్పత్తి గావించువారిని) త్రోసివేసినట్లుగానే, ఇప్పుడిది, లోగడ కార్మికులవలెనే, కాపిటలిస్టులనుకూడా త్రోసివేసి వారినికూడా, పారిశ్రామికసైన్యంలో కల్పకపోయినా, అవుసరజనాభాగా మాత్రం చేస్తుంది.

కాని జాయంటు స్టాకుకంపెనీలక్రిందమారినా, ట్రస్టుల క్రిందమారినా, ప్రభుత్వఆస్తిక్రిందమారినా, కాపిటల్ గా వుపయోగపడే వుత్పత్తిశక్తుల స్వభావంమాత్రం మారదు. జాయంటు స్టాకుకంపెనీలు, ట్రస్టులవిషయంలో ఇది బాహాటంగానే కన్పిస్తుంది. ఆధునిక రాజ్యాంగయంత్రంమాత్రం కాపిటలిస్టుసంస్థకాక మరేమిటి? కార్మికులచేగాని, వ్యక్తిగత కాపిటలిస్టులచేగాని ఆక్రమించుకోబడకుండా కాపిటలిస్టు

వుత్పత్తివిధానంయొక్క జనరల్ బాహ్య పరిస్థితులను నిలబెట్టి వుంచుటకై బూర్జువావర్గం ఏర్పాటుజేసుకొన్న నిర్మాణ స్వరూపమాత్రమే ప్రభుత్వం. దానిరూప మెట్లావుండనీ యండి; ఆధునిక రాజ్యాంగయంత్రం (ప్రభుత్వం) పూర్తిగా కాపిటలిస్టుయంత్రమే; అది కాపిటలిస్టుల ప్రభుత్వం; ఆదర్శ యుతమగు కాపిటలిస్టురాశి. ఎక్కువ వుత్పత్తిశక్తుల నది స్వాధీనంలోనికి తెచ్చుకొన్నకొలదీ అది మరింత నిజమగు కాపిటలిస్టురాశి అవుతుంది; మరింత ఎక్కువమంది ప్రజా సామాన్యాన్ని దోచుకుంటుంది. కార్మికులు కూలిపనివారు గానే, శ్రామికులుగానే వుంటారు. కాపిటలిస్టు సంబంధాలు రద్దుగావింపబడలేదు. పైగా అవి కొసకు జేరుతవి. కాని ఈ కొసకుజేరినదశలో, అవి మూలములోనే మార్పుజెంద గలవు. ఉత్పత్తిశక్తులు ప్రభుత్వాధీనంకావటం అంత్యపరిష్కారమార్గం కాదుకాని దానిలో అంతర్గతంగా, లాంఛనరూప మగు మార్గాలు, సమస్యాపరిష్కారమునకు కీలకం, వున్నవి.

కాబట్టి ఆధునిక ఉత్పత్తిశక్తులయొక్క సామాజిక స్వభావాన్ని ఆచరణలో గుర్తించుటలోనే, అందుచేత, ఉత్పత్తి, భుక్తము, మారకముల పద్ధతులనన్నిటినీ ఉత్పత్తి విధానంయొక్క సామాజికస్వభావంతో మేళవింపజేయుట లోనే, పరిష్కారమార్గం వున్నది. కాబట్టి, సమాజమే స్వయంగా, సూటిగా, అసందిగ్ధంగా, తన్ను ఒక్కదానినిమినహా మరి యే యితరముయొక్క కంట్రోలుకూ అతీతంగా పెరిగి పోయిన ఉత్పత్తిశక్తులను స్వాధీనంచేసుకొనటంద్వారానే ఇది సాధ్యమౌతుంది. ఆవిధంగానే, ఏవైతే ఈనాడు ఉత్పత్తివిధా

నమునూ, మారకవిధానమునూ తరచూ ప్రబద్ధలుగావిస్తూ, అతితీవ్రమగు, వినాశనకరమగు గుడ్డిప్రకృతిసూత్రంగా బహిరతమౌతూ, ఈనాడు ఉత్పత్తిదారులకే వ్యతిరేకంగా పని జేస్తూవున్నవో, ఆ ఉత్పత్తిశక్తులయొక్క, దినుసులయొక్క సామాజికస్వభావాన్ని ఉత్పత్తిదారులు తమ యిష్టానుసారం వినియోగించగల్గుతారు; ఈ విధంగా, తరచూ సంభవించే కల్లోలములకూ, ఆర్థికపతనములకు కారణభూతములైనవే ఉత్పత్తికి అతిబలీయములగు లీవర్లుగా రూపాంతరమును పొందగలవు.

సరిగ్గా ప్రకృతిశక్తులవలెనే, సమాజశక్తులుకూడా పని జేస్తూవుంటాయి; మనం వాటిని అర్థంచేసుకొననంతకాలం, మనం వాటిని గణించనంతకాలం, అవి గ్రుడ్డిగా, దౌర్జన్యంగా, వినాశనకరంగా పనిజేస్తూవుంటాయి. కాని ఎప్పుడైతే మనం ఒక్కసారి అవి ఎట్లాపనిజేస్తాయో, ఏరీతిగాపనిజేస్తాయో, వాటి ఫలితాలేమిటో, తెలుసుకొని అర్థంజేసుకొంటామో, అటుపిమ్మట వాటిని క్రమంగా మన యిచ్ఛకు లోబర్చుకొని, మన లక్ష్యమును సాధించుటకై వుపయోగపర్చుట మన చేతులలోనే వున్నది. బ్రహ్మాండమగు ఆధునిక వుత్పత్తిశక్తులగూర్చికూడా ఇది పూర్తిగా సత్యమే. మనం వీటి ప్రకృతిని, స్వభావాన్ని, అర్థంజేసికొనుటకు మొండిగా నిరాకరించామంటే — ఈవిధంగా అర్థం జేసుకొననీయకుండా కాపిటలిస్టు వుత్పత్తిశక్తులు, వాటి రక్షకులుకూడా ఎదురు తిరుగుతారు — మనం లోగడ వివరంగా చూచినట్లుగానే, ఈశక్తులు మనలను లక్ష్యంచేయకుండానే, మనకు వ్యతి

రేకంగానే పనిజేస్తూ, మనపై ఎక్కి స్వారిచేస్తూ వుంటాయి. కాని ఒక పర్యాయం మనం వాటిస్వభావాన్ని అర్థంజేసి కొన్నామా, సమిష్టిగా పనిజేసే వుత్పత్తిదారుల చేతులలో అవి, పెత్తందార్లుగాకాక వినయవిధేయతలు కల్గిన భృత్యులుగా మెలగగలవు. తుపానులోకల్గే మెరుపులలోవుండే వినాశనకరమగు విద్యుత్తుకూ, టెలిగ్రాఫ్, ఆర్కులైట్లలోవుండే విద్యుత్తుకూ తేడా ఇదే; కార్చిచ్చుకూ, మనుష్యుని సేవలో వుండే నిప్పుకూ వుండే తేడా ఇదే. ఈవిధంగా ఆధునికవుత్పత్తి శక్తులను వాటి ప్రకృతిని అనుసరించి వుపయోగించుట చివరకు ఈనాటికి తెలియవచ్చింది; ఇందుమూలకంగా, అరాజకంగా జరిగే సామాజికోత్పత్తిబదులు, సమాజం అంతటియొక్క అవుసరాలకు, విడివిడిగా అందలి ప్రతియొక్కవ్యక్తి అవుసరాలకు అనుగుణ్యంగా వుత్పత్తినంతా ప్లానుప్రకారం నియమబద్ధం చేయుటకు మార్గం సుగమమౌతుంది. మొట్టమొదటగా వుత్పత్తిదారునీ, (producer) అటుపిమ్మట భుక్తదారునీ (appropriator) కూడా తనకు బానిసగా జేసికొనే కాపిటలిస్టు భుక్తవిధానం తోసివేయబడుతుంది; దాని స్థానే ఆధునిక వుత్పత్తిసాధనాల ప్రకృతిని అనుసరించియే దినుసుల భుక్త పద్ధతికూడా ఏర్పాటు కాబడుతుంది. సమాజమంతా భుక్తంగావించేది ఉత్పత్తిని నిలబెట్టుటకూ, విస్తరింప జేయుటకూ సాధనంగావుంటుంది; మరొకవైపున వ్యక్తిగతంగా భుక్తంగావించేది; బ్రతుకుతెరువునకూ, ఆనందమునకూ సాధనంగా వుంటుంది.

జనాభాలో ఎక్కువ భాగాన్ని అంతకంతకూ శ్రామి

కులుగా మార్చుటద్వారా కాపిటలిస్టు వుత్పత్తివిధానం ఒక శక్తి జన్మకు కారణమాతుంది. ఈ శక్తి తాను నాశనం కాకుండా వుండాలంటే ఈ విప్లవాన్ని ఇంకా ముందుకు కొన సాగించవలసివుంటుంది. సామాజికోత్పత్తి సాధనాలు అంతకం తకూ ప్రభుత్వ ఆస్తిగా మార్చబడుటయే ఈ విప్లవం ఏ మార్గాన సాగాలో సూచిస్తున్నది. శ్రామికవర్గం రాజ్యాంగ యంత్రాన్ని లాగుకొని ఉత్పత్తి సాధనాలను ప్రథమంగా ప్రభుత్వాం ఆస్థిగా మార్చగలదు. కాని ఇట్లా చేయటంలో శ్రామికవర్గం తన్నుతానే అంతం జేసుకొంటుంది; అన్ని వర్గ వైరుధ్యాలనూ, వర్గవైషమ్యాలనూఅంతంజేస్తుంది. రాజ్యాంగ యంత్రాన్నికూడా రాజ్యాంగయంత్రంకాకుండా అంతం గావి స్తుంది. వర్గ వైరుధ్యాలమధ్య సంచరించు పూర్వపు సమాజము నకు రాజ్యాంగయత్రం అవుసరమున్నది. రాజ్యాంగయంత్ర మనగా ఆయాదశలలో దోపిడివర్గం తన బాహ్య వుత్పత్తి పరిస్థి తులను నిలబెట్టి వుంచుకొనుటకై ఏర్పాటుజేసిన సంస్థ; కాబట్టి దోచుకోబడే వర్గాన్ని అనాటి దోపిడి వుత్పత్తి విధానములో (బానిసత్వంలో, వ్యావసాయికబానిసత్వంలో 'లేక' కౌలుదారీ పరిస్థితులలో, కూలి పనిలో) బలవంతంగా తొక్కి-పెట్టివుంచు టకైన సంస్థ. రాజ్యాంగయంత్రమనగా మొత్తం సమాజం యొక్క- అధికార ప్రతినిధి; ఒకే వాస్తవికసంసరూపంలో సమాజం పుంజీభవించియుడుట; కాని, తనకాలంలో, మొత్తం సమాజం అంతటికీ ప్రాతినిధ్యంవహించే ఒకవర్గంయొక్క- ప్రతినిధిగానే, అంతవరకుమాత్రమే ఇది సమాజప్రతినిధిగా

వుంటుంది. పురాతనకాలంలో అది బానిసయజమానుల ప్రభుత్వం; మధ్యయుగాల నాడు అది జమీందార్ ప్రభువులది; మనకాలంలో బూర్జువావర్గ రాజ్యాంగయంత్రం. ఎప్పుడది నిజంగా సమాజమంతటియొక్క ప్రతినిధిగా రూపభేదాన్ని పొందుతుందో అప్పుడింక అది అనవుసరమౌతుంది. ఎప్పుడైతే సమాజంలో ఒకవర్గాన్ని అణచివుంచవలసిన అవుసరం వుండదో, ఎప్పుడైతే వర్గప్రాబల్యమూ, ఇంతవరకూ ఉత్పత్తి విధానంలోవున్న అరాజకంవల్ల వ్యక్తిజీవనమునకై జరిగే పోరాటమూ దీనివల్ల కల్గే సంఘర్షణ, దుర్ణయాలు, అంత మొందింపబడగలవో, అప్పుడు అణచిపెట్టివుంచవలసినది ఇక ఏమీవుండదు. ప్రత్యేక పీడనశక్తియొక్క అవుసరం ఇందు మూలకంగా వుండదు. సమాజంపేరిట ఉత్పత్తిసాధనాలనన్నిటినీ స్వాధీనంచేసుకొనుటద్వారా రాజ్యాంగయంత్రం మొట్టమొదటిసారిగా సమాజమంతటియొక్క ప్రతినిధిగా వస్తుంది. అది రాజ్యాంగయంత్రంగాచేసే ఆఖరిచర్యకూడా ఇదే. సామాజిక సంబంధాలలో ఒకరంగంనుండి మరొకరంగంలో ప్రభుత్వ జోక్యం అనవుసరమౌతూవస్తుంది; చివరకు రాజ్యాంగ శక్తితనంతటతానే అంతరిస్తుంది. వ్యక్తుల ప్రభుత్వంస్థానే వస్తువుల నిర్వహణ, ఉత్పత్తిక్రమమును సరళంగా నడుపుటవస్తుంది. రాజ్యాంగయంత్రం "రద్దు" గావింపబడదు; అది హరించిపోతుంది. (The state is "abolished" it withers away) * ఈ

* సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీ (బోల్షివిక్) 18వ కాంగ్రెసులో, ఈఎంగెల్సు థీసిస్‌ను వుదహరిస్తూ, రాజ్యాంగ యంత్రమును గూర్చిన మార్క్సిజం – లెనిన్‌జం సిద్ధాంతమును కామ్రేడ్ స్టాలిన్ ఈక్రింది విధంగా విపులీకరించాడు.

"ఎంగెల్సుయొక్క ఈప్రతిపాదన సరియైనదేనా? అవును; అది సరియైనదే. కాని ఈక్రిందిరెండింటిలో ఏదో ఒకపరిస్థితిలో మాత్రమే అదిసరియైనది. 1. మనం సోషలిస్టురాజ్యాంగమును, దాని దేశాంతర్గత అభివృద్ధి క్రిమదృష్ట్యా మాత్రమే చూడాలి. అంతర్జాతీయ విషయమునుండి ముందుగానే మనలను మనం మినహాయించుకోవాలి; వీలుకొరకూ పరిశీలనా సౌకర్యంకొరకూ అంతర్జాతీయపరిస్థితులనుండి దేశాన్ని, రాజ్యాంగయంత్రాన్ని మినహాయించాలి. ఆవిధంగా, అంతర్జాతీయపరిస్థితులనుండి మినహాయించి, రాజ్యాంగయంత్రాన్ని విడిగా చూచినప్పుడే ఈప్రతిపాదన సరియైనదిగా కన్పించగలదు. 2. అన్ని దేశాలలోనూ, లేదా, ఎక్కువదేశాలలోనూ సోషలిజం విజయం పొందినదని మనం అనుకోవాలి; కాపిటలిజం చుట్టిముట్టి వుండుటబదులు, సోషలిస్టుశక్తియే చుట్టిముట్టి వుండాలి; విదేశీయుల దండయాత్రాభయం ఇంకా లేకుండా పోవాలి; ఇక సైన్యాన్నిగాని, రాజ్యాంగ యంత్రాన్నిగాని బలపర్చవలసిన అవుసరంలేకుండా వుండాలి. అప్పుడే ఈప్రతిపాదన సరియైనదిగాకన్పించగలదు.

"సరే బాగానేవున్నది; సోషలిజం ఒకే ఒక దేశంలోగనుక జయప్రదమౌతే, ఇదుమూలకంగా అది అంతర్జాతీయ పరిస్థితులనుండి విడబడుట అసాధ్యమైతే, అప్పటి సంగతి యేమిటి? ఎంగెల్సు సూత్రం ఇందుకు జవాబును చూపలేదు, నిజానికి ఎంగెల్సుకూడా ఇట్టి సమస్యను ఎదుర్కోలేదు; అందుచేతనే అట్టి ప్రశ్నకు జవాబును ఈయలేదు; అన్ని దేశాలలోగాని, లేక ఎక్కువదేశాలలోగాని దాదాపుగా ఒకేసారిగా సోషలిజం జయప్రదమైనదన్న భావంతో ఎంగెల్సు బయలుదేరాడు. కాబట్టి ఎంగెల్సు, ఏఒక్క దేశంలోని ఏఒక్క సోషలిస్టు రాజ్యాంగయంత్రాన్ని గూర్చి ఇక్కడ పరిశీలించటంలేదు. సోషలిజం అధికసంఖ్యాక దేశాలలో జయప్రదమైనదన్న తలంపుపై, జనరల్ గా సోషలిస్టు రాజ్యాంగ యంత్రాన్నిగూర్చి ఎంగెల్సు ప్రస్తావించాడు. "అధికసంఖ్యాక దేశాలలో సోషలిజం విజయం పొందినదనుకొందాము. అప్పుడు శ్రామికవర్గ రాజ్యాంగయత్రం ఎట్టి మార్పులను పొందాలి" అనే ప్రశ్నపై ఎంగెల్సు బయలుదేరాడు. సమస్యను ఇట్లా జనరల్ గా, అవిశిష్టంగా చూచుటకే సోషలిష్టు రాజ్యాంగయంత్రాన్నిగూర్చిన పరిశీలనలో ఎంగెల్సు అంతర్జాతీయ పరిస్థితులనుండీ, అంతర్జాతీయ స్థానమునుండీ తన్ను తాను వేరుజేసుకొన్నాడు.

"కాబట్టి దీనినుండి తేలేదేమిటంటే, ఎంగెల్సు జనరల్ గా సోషలిస్టు రాజ్యాంగయంత్రమునుగూర్చి చేసిన జనరల్ సూత్రం, ఒకేదేశంలో సోషలిజం

ఈ దృక్పథంనుండే మనం "స్వతంత్ర ప్రజల ప్రభుత్వం"* అనే నినాదాన్ని చూడాలి; ఆందోళనా కార్యములలో ఈ నినాదం అవుసరమే; కాని అంత్యములో శాస్త్రీయంగా అది అసమర్థము; ఈ విషయాన్ని మనం చూడాలి. ఇదే దృక్పథం నుండి, కనురెప్పపాటులో రాజ్యాంగయంత్రాన్ని నాశనం

---

జయంపొందిన నిర్దిష్టమగు, ప్రత్యేకమగు సందర్భాలకు వర్తించదు. ఇట్టి దేశం కాపిటలిస్టు దేశాలచే చుట్టుముట్టబడి వుంటుంది; విదేశ సైనికదాడికి ఎరఅగు ప్రమాదంలోవుంటుంది; అందుచే అంతర్జాతీయ పరిస్థితులనుండి విడి పడి దూరంగా వుండలేదు; కాబట్టి తన స్వాధీనంలో బాగా తర్ఫీదుపొందిన సైన్యమును, సుశిక్షితమగు అధికారవర్గమును, బలీయమగు చారుల బలగమును కలిగియుండాలి. అంటే, విదేశదాడులనుండి సోషలిస్టు విజయములను రక్షించుటకు సమర్థమైన రాజ్యాంగయంత్రమును కల్గివుండాలి.

"మన కాలమునకు 45,55 ఏండ్లు ముందున్న మార్క్సిస్టు శ్రేష్టరచయితలు ప్రతిఒక్క దేశంలోని భావిచరిత్ర ఎట్టి వక్రరీతులలో పోతుందో ముందుగానే తెలుసుకొని వుండగల్గుతారని వూహించుట మనకు సరికాదు. ఈమార్క్సిస్టు ఉత్కృష్టరచయితలు, మన లాభంకొరకై, తమ తర్వాత 50, 100 ఏండ్లలో వచ్చేసమస్య లన్నిటికీ పరిష్కారమార్గములను తయారుచేసి వుంచుతారు; అందువల్ల, ఆఉత్కృష్ట రచయితల సంతతివారమైన మనం చలి మంటలవద్ద జోగుతూ, వారు తయారుచేసియిచ్చిన పరిష్కారములను నెమరు వేస్తూ కూర్చోవచ్చును; ఇందుకు వారు సహాయపడుతారు, అనుకొనటం పూర్తిగా అసందర్భం."

(స్టాలిన్, "లెనినిజం సమస్యలు" నుండి.) అనువాదకుడు.

* 'స్వతంత్రప్రజల ప్రభుత్వం' అన్నదానినిగూర్చి మార్క్సువ్రాసిన "గోథాప్రోగ్రాము విమర్శన వ్యాసము"ను చూడండి. (అనువాదకుడు)

గావించాలనే అరాజకవాదనామధారులకోర్కెనుచూడాలి.**

చరిత్రలో కాపిటలిష్టు వుత్పత్తివిధానం ప్రారంభమైన నాటినుండీ, వుత్పత్తిసాధనముల నన్నిటినీ సమాజం వశపర్చుకొను విషయమునుగూర్చి, భవిష్యత్తులో దానినొక ఆదర్శంగా కొద్దో గొప్పో అస్పష్టంగా కొందరు వ్యక్తులూ, కొన్ని తెగలూ కలలుగంటూవుండేవి. కాని దానిని పొందగల వాస్తవిక పరిస్థితులు అన్నీ ఒనగూడినప్పుడే అది సాధ్యముకాగలదు; చారిత్రికంగా అవుసరమూకాగలదు. న్యాయము, సమత్వములకు విరుద్ధముగా వర్గము లేర్పడివున్నవని కనుగొనుటవల్లగాని, ఈ వర్గములను రద్దుగావించవలెననే మానవుల ఇచ్ఛనుండిగాని ఇది సమకూరదు; ఇతర ప్రతి ఒక్క సామాజిక పురోగమనము వలెనే, ఇదికూడా కొన్ని నూతన ఆర్థికపరిస్థితుల నుండియే వుదయించుతుంది. సమాజం ఇంతవరకూ దోచుకొనే, దోచుకొనబడే వర్గాలక్రింద చీలివున్నదంటే, పరిపాలక పరిపాలిత వర్గములక్రింద చీలివున్నదంటే, అందుకు కారణం వుత్పత్తిఅభివృద్ధి ఇంకా హీనదశలో వుండుటయే. సామాజిక శ్రమయంతా కూడి వుత్పత్తిజేసినా; అందరియొక్క కేవలం

---

** ప్రౌధన్, బకునిన్ మున్నగు అరాజకవాదులు రాజ్యాంగ యంత్రం నిజస్వరూపాన్ని గుర్తించలేదు. అందుచే, విజయులగు శ్రామికులచేతులలో అది ఎట్టి విప్లవశక్తిగా పనిచేస్తుందో వీరు గుర్తించలేదు. "ఉన్నపాటున రాజ్యాంగయంత్రం నాశనంగావాలి" అన్ననినాదం "శ్రామికవర్గ నియంతృత్వం" అనే నినాదంతో సిద్ధాంతచర్చకు, ఘర్షణకు దారితీసింది; వారి శిష్యులు ఈశ్రామికవర్గ నియంతృత్వంతో బహిరంగముగా పోరాడుటకే ఉపక్రమించారు.

(అనువాదకుడు).

జీవనమునకే సరిపడి, చాలా స్వల్పంగానే వుత్పత్తి దినుసులు మిగులుతూ వుండేటంతకాలం; కాబట్టి, సమాజంలో అత్యధిక సంఖ్యాకులయొక్క మొత్తంకాలం లేదా, అధికభాగం, ఈ వుత్పత్తి దినుసుల నుత్పత్తి జేయు శ్రమలోనే వినియోగించ బడుచున్నంతకాలం, సమాజం తప్పనిసరిగా వర్గముల క్రింద విభజింపబడివుంటుంది. పూర్తిగా శ్రమలో మునిగి తేలుతూ వుండే ఈ అత్యధికసంఖ్యాకులకు తోడుగా, స్వయంగా వుత్పత్తి శ్రమను గావించకుండగనే, సమాజంయొక్క జనరల్ వ్యవహారాలను చక్కబెట్టు ఒకవర్గం — కార్మికశక్తిని, రాజ్యాంగవ్యవహారాలను, న్యాయమును, సైన్యను, కళలను, ఇతరములను చక్కబెట్టు ఒకవర్గం — ఉదయించినది. కాబట్టి శ్రమవిభజన సూత్రమే వర్గ విభజనకు మూలం. కాని ఇది అన్నామంటే, దౌర్జన్యం, దోపిడి, మోసం, కుట్రలు వర్గ విభజనకు తోడ్పడలేదనిగాని, పరిపాలకవర్గం ఒకపర్యాయం తాను తన్ను నెక్కినపిమ్మట కార్మికవర్గనష్టంపై తాను బాగుపడుటకు ప్రయత్నించలేదనిగాని, సమాజానికి తాను సారధ్యం వహించటం ప్రజాసామాన్యాన్ని ఇంకా ఎక్కువగా దోచుకొనుటకు కాదనిగాని, అనుకొనరాదు.

కాని వర్గముల క్రింద విభవింపబడివుండుట చారిత్రికంగా అవుసరమైనదని చూపుచున్నామంటే, అది ఒక కాలమునకుమాత్రమేననీ, కొన్ని ప్రత్యేక సామాజిక పరిస్థితులకేననీ, అన్వయించుకోవాలి. అది ఉత్పత్తి కొరతమీాదనే ఆధారపడివున్నది. ఆధునిక ఉత్పత్తిశక్తులు పూర్తిగా అభివృద్ధిజెందినప్పుడు అది తుడిచిపెట్టబడుతుంది. నిజానికి, సామాజిక వర్గ

ములనంతమొందిస్తామంటే, ఒక చారిత్రిక పరిణామదశను జేరినట్లు ముందుగానే అనుకొంటున్నామన్నమాట; ఇట్టి పరిణామదశలో ఈ, ఆ, పరిపాలకవర్గము అనవుసరమూ, అసంగతమూ అగుటయేగాక ఏ పరిపాలకవర్గమూ అనవుసరమూ, అజాగళస్తనమూ అవుతుంది; అంటే, వర్గవిభేదమే అనవుసరమూ, అజాగళస్తనమూ అవుతుంది. * కాబట్టి సమాజంలోని ఒక ప్రత్యేకవర్గంచే వుత్పత్తిసాధనాలు, దినుసులు భుక్తం

---

* శ్రామికవర్గ నియంతృత్వంద్వారా సోవియటు యూనియన్‌లో వర్గరాహిత్యము ఒనగూర్చబడుచున్నది. పరాన్నభుక్కుల వర్గముల శేషాన్ని పూర్తిగా తుడిచిపెట్టటం, వర్గరహితమగు సోషలిస్టు సమాజాన్ని ఏర్పర్చటం రెండవ పంచవర్ష ప్రణాళికయొక్క ధ్యేయంగా సోవియటు యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 17 వ కాంగ్రెసు నిర్ణయించినది. వర్గపోరాటాన్ని ఇంకా తీవ్రతరంజేయటంద్వారానే, రాజ్యాంగయంత్రాన్ని నిల్పివుంచటమేగాక దానినింకా స్థిరపర్చి, తీక్ష్ణపర్యటనంద్వారానే, అనగా, శ్రామికవర్గనియంతృత్వంద్వారానే ఈ కర్తవ్యం నెరవేర్చబడగలదు. ఈ విధంగా శ్రామికవర్గ రాజ్యాంగయంత్రాన్ని స్థిరపర్చి, ఇంకా అభివృద్ధిపర్చటంద్వారానే రాజ్యాంగ యంత్రం హరించి పోవటం జరుగుతుంది.

"మేము రాజ్యాంగయంత్రం హరించుపోవుటకు సుముఖంగానే వున్నాము: ఆదేసమయంలో, ఇంతవరకూ వున్న రాజ్యాంగయంత్రరూపాలు అన్నిటికన్న ఎక్కువబలీయమూ, అధికారయుక్తమూ అగు శ్రామికవర్గనియంతృత్వాన్ని బలపర్చ గోరుచున్నాము. రాజ్యాంగయంత్రం హరించిపోవుటకై అవుసరమగు పరిస్థితులను కల్పించే వుద్దేశంతోనే రాజ్యాంగశక్తిని సాధ్యమైనంత హెచ్చుస్థాయికి అభివృద్ధిచేయటం: ఇదే మార్క్సిస్టువిధానం. ఇది 'పరస్పరవిరుద్ధమా'? అవును 'పరస్పరవిరుద్ధమే.' కాని ఈ వైరుధ్యం జీవితంలోనేవున్నది: ఇది పూర్తిగా మార్క్సిస్టు గతితార్కిక విధానాన్ని ప్రతిబింబిస్తున్నది. [స్టాలిన్. సో.యూ.క. పార్టీ. (బోల్షివిక్కు) 16వ కాంగ్రెసు: సెంట్రల్ కమిటీకిచ్చిన రాజకీయ నివేదిక నుండి: [illegible], వాల్యూం II]

జేసికోబడటంగానీ, వీటితోబాటుగా, రాజకీయాలు చదువు, విజ్ఞానం మున్నగు విషయాలలో నాయకత్వం వహింపబడటం గానీ అనవుసరమేగాక రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానికాభివృద్ధులకు ఆటంకకరంగాకూడా నిలుస్తుంది అన్నంత లెవెల్‌కు ఉత్పత్తి అభివృద్ధియైనదని తెలుస్తున్నది.

ఈ మెట్టు ఇప్పుడు జేరుకోబడింది. తమ రాజకీయ, జ్ఞాన నాయకత్వముల దివాళాకోరుతనం బూర్జువావర్గానికే తెలిసివస్తూయున్నది; అదేమీ దాగివుండుట లేదు. దీని ఆర్థిక దివాళా పదిసంవత్సరముల కొకసారి, క్రమంతప్పకుండా వస్తూవుంటుంది; ప్రతిసంక్షోభంలోనూ సమాజం, తన ఉత్పత్తిశక్తుల, దినుసుల బరువుక్రింద తానే వూపిరిసలుపక కొట్టుకుంటూవుంటుంది; ఈ శక్తులను, దినుసులను అదేమీ ఉపయోగించుకోలేదు; కొనుగోలుదారు లెవ్వరూ లేకపోవుటచే ఉత్పత్తిదారులకు తింటానికి ఏమీలేకపోతుంది; అనే వైరుధ్యంముందు సమాజం నిస్సహాయురాలైపోతుంది. ఉత్పత్తి సాధనాల విస్తరణశక్తి, తనకు కాపిటలిస్టు ఉత్పత్తివిధానంచే కల్పించబడిన బంధనములను పటాపంచలు గావిస్తుంది; ఈ బంధములనుంచి సమాజం విముక్తినొందుటయే, కని విని యెరుగనంతగా, సంతతం అతివేగంగా వుత్పత్తిశక్తులు పురోగమించుటకూ, అందుమూలకంగా అంతులేని ఉత్పత్తి జరుగుటకూ కావలసిన ఒకేఒక షరతు. ఇంతమాత్రమే కాదు; సమాజంచేత ఉత్పత్తి సాధనాలన్నీ భుక్తపర్చుకోబడటం మూలకంగా ఈనాడు వుత్పత్తిపైవున్న కృత్రిమ ఆటంకములన్నీ తొలగిపోవుటయేగాక, నేడు వుత్పత్తివిధా

నంలో అంతర్భూతంగావుంటూ, సంక్షోభసమయాలలో అతి వృద్ధదశకువచ్చే వుత్పత్తిశక్తుల, దినుసుల నిరుపయోగం, వినాశనం అంతముకాగలవు. ఇంతేగాదు: ఈనాటి పరిపాలక వర్గములచేతనూ, వారి రాజకీయ ప్రతినిధులచేతనూ అనుభవించబడే దేవేంద్రభోగములనూ, విలాసములనూ, దుబారాను అంతమొందించుటద్వారా వుత్పత్తిసాధనాలనూ, దినుసుల పెద్దమొత్తాలను సమాజం మొత్తమునకు లభ్యంగావిస్తుంది. సామాజికోత్పత్తిద్వారా, సమాజంలోని ప్రతిఒక్క వ్యక్తికీ, భౌతికదృష్ట్యా ఆతనికి పూర్తిగాసరిపడే, ఆతడు రోజురోజుకూ భాగ్యవంతుడగుటకు అవకాశం లభించుటయేగాక, వారందరూ తమశారీరిక, మానసికశక్తులను పూర్తిగా, స్వేచ్ఛగా అభివృద్ధిజేసుకొనుటకూ, వినియోగించుటకూ సరిపడు జీవనాన్ని కల్గించుఅవకాశం లభిస్తుంది—— అట్టి అవకాశం మొట్టమొదటసారిగా ఇప్పుడు ఏర్పడింది, నిజంగానే ఏర్పడి వున్నది. *

---

* "కాపిటలిజం భారంక్రింద నలిగిపోతువున్నప్పటికీ, ఆధునిక వుత్పత్తిసాధనాల విస్తరణశక్తి ఎంత బ్రహ్మాండమైనదో కొద్దిలెక్కలద్వారా చూచాయగా తెలియగలదు. గిప్ఫెను అంచనాప్రకారం, గ్రేటుబ్రిటను, ఐర్లాండుల మొత్తంసంపద ఈక్రింది విధంగావున్నది.

| | | |
|---|---|---|
| 1814 లో | 220,00,00,000 పౌండ్లు | స్టెర్లింగులు |
| 1865 లో | 610,00,00,000 పౌండ్లు | ,, |
| 1875 లో | 850,00,00,000 పౌండ్లు | ,, |

సంక్షోభంవల్ల వుత్పత్తి సాధనముల, దినుసుల నిరుపయోగత ఎంత హెచ్చుగావుంటుందో రెండవజర్మను పారిశ్రామిక సమావేశంయొక్క (21-2-1878 జర్మనీ) లెక్కలవల్ల తెలియగలదు. ఆలెక్కలప్రకారం గత

ఉత్పత్తిసాధనములను సమాజం స్వాధీనంచేసుకొనుట ద్వారా సరుకుల ఉత్పత్తివిధానమునకు స్వస్తి చెప్పబడుతుంది; అందుమూలకంగా దినుసు యే ఉత్పత్తిదారుని ఏలునట్టి పరిస్థితి అంతరిస్తుంది. అరాజకంగా జరిగేదానిబదులు సామాజి

---

సంక్షోభంలో జర్మను ఇనుము పరిశ్రమకు మొత్తం 44, 50,00,000 మార్కుల నష్టంవచ్చింది." (ఎంగెల్సు షరా)

కాపిటలిజంయొక్క చరమదశ, అత్యున్నతదశయగు సామ్రాజ్యవాదంలో ఈ ఉత్పత్తిశక్తుల అభివృద్ధి ఇంకా ఎంత హెచ్చుగావుంటుందో లెనిన్ తెలియజేశాడు.

"గుత్త వ్యాపార సంస్థలు, సర్వాధికారులగు కొలదిమంది కూటమి, స్వేచ్ఛకై ప్రయత్నించుటగాక పెత్తనంకొరకై తాపత్రయపడుట, బహుళధనాఢ్యమైన బహుబలీయమైన కొలది దేశాలచే చిన్న, బలహీనమగు అనేక దేశాల దోపిడి— ఇవన్నీకూడా సామ్రాజ్యవాదంయొక్క ప్రత్యేక లక్షణాలు; వీటి వల్లనే కాపిటలిజం పరాశ్రయజీవియనీ, క్షీణవ్యవస్థగాను అవుచున్నది. అంతకంతకూ బాండుహోల్డరులగు (వడ్డీపై జీవించు) రాజ్యాంగమును ఋణదాత రాజ్యాంగంగా సామ్రాజ్యవాద లక్షణాలు బహిర్గతమౌతవి; ఇట్టిరాజ్యాంగంలో బూర్జువావర్గం పెట్టుబడిని ఎగుమతిచేయటంద్వారాను దళారీ పని ద్వారాను (Cupon clipping) వచ్చే ఆదాయంపైననే బ్రతుకుతుంది. ఈ విధంగా కాపిటలిజం క్షీణదశకు వచ్చిందంటే, అది విపరీతాభివృద్ధిని పూర్తిగా కోల్పోయిందని పొరబాటుపడరాదు. సామ్రాజ్యవాద దశలో, పరిశ్రమలలో కొన్ని శాఖలు, బూర్జువావర్గం కొన్ని తరగతులు, కొన్ని దేశాలు, కొద్దోగొప్పో ఏదోఒక లక్షణాలను ప్రదర్శించగలవు. మొత్తంమీద, ఇదివరకంటె కాపిటలిజం విపరీతవేగంతో పెరుగుతుంది, కాని ఈ పెరుగుదల మాత్రం అసమానంగావుంటుంది, అసమానంగా వుండటమేగాదు; ముఖ్యంగా, కాపిటల్లో అత్యధికసంపన్నమగు దేశాలే క్షీణదశలో వుండటాన్ని ఈ అసమానాభివృద్ధి జూపిస్తుంది. (ఉదాహరణకు, ఇంగ్లాండు) (లెనిన్, 'సామ్రాజ్యవాదం, కాపిటలిజం అత్యున్నతదశ' అన్న గ్రంధంనుండి. — (అనువాదకుడు)

కోత్పత్తి, నిర్ణీతమగు ప్లానునుగల చైతన్యపూరితమగు నిర్మాణ రూపంలో జరుగుతుంది. ఎవరికివారే వ్యక్తిగతజీవనమునకై పోరాడుట అంతమౌతుంది. ఇట్టిదశలో, ఒకఅర్థంలో మానవుడు పూర్తిగా పశుప్రపంచమునుండి విడివడి, పశుజీవన పరిస్థితులను వదలి, నిజంగా మానుషమైన పరిస్థితులలో జీవించుట ప్రారంభమౌతుంది. మానవుని పరిసరములైన ఆతని జీవనపరిస్థితులు ఇంతవరకూ ఆతనిపై రాజ్యంచేస్తూ వుండేవి; ఈ దశలో, ఆ జీవనపరిస్థితులే ఆతని ఏలుబడికి, అదుపుకు లోబడగలవు; మొట్టమొదటిసారిగా ఆత డిప్పుడు ప్రకృతికి యజమాని అవుతాడు; ఎందుచేతననగా, తన స్వాంత సామాజికవ్యవస్థపై తాను యాజమాన్యం వహించుచున్నాడు. ఇంతవరకూ ఏదో బాహ్యమైనదిగాకన్పడుతూ తన్ను శాసిస్తున్న ప్రకృతిసూత్రములుగావున్న తన స్వాంతసామాజిక కృత్యముల సూత్రములు ఇప్పు డాతనికి పూర్తిగా గ్రాహ్యమై చైతన్యంతో ఉపయోగింపబడగలవు; అందుచే అతని పెత్తనం క్రిందకు రాగలవు. ఇంతవరకూ ప్రకృతిచేత, చరిత్రవల్ల తమపై బలవంతంగా రుద్దబడి, తమకు వ్యతిరేకంగావుండే మానవుల స్వాంతసామాజికవ్యవస్థ, ఇకముందు ప్రజలమధ్య స్వచ్ఛందంగా ఏర్పడే చర్యగా అవుతుంది. ఇంతవరకూ చరిత్రపై పెత్తనంజేసిన వాస్తవిక, బాహ్యశక్తులు ఇప్పుడు మానవుల అదుపులోనికి రాగలవు. ఈ దశనుండియే, మానవులు పూర్తిచైతన్యముతో, తమచరిత్రను తామే నిర్మించుకుంటారు; ఈ దశనుండియే, మానవునిచే నడకలో పెట్టబడిన సామాజిక కారణాలు ప్రధానంగానూ, అంతకంత కెక్కువగానూ, మాన

వుల ఇచ్ఛాప్రకారం జరుగు ఫలితాలను పొందగలవు. ఇది మానవుడు అవసరములరాజ్యంనుండి స్వేచ్ఛారాజ్యమునకు వేసిన అంగ.

ఆఖరులో, అభివృద్ధిక్రమముయొక్క చిత్రమును క్లుప్తంలో చెప్పి ముగిస్తాను.

I మధ్యయుగపు సమాజము:— కొద్దిఎత్తున వ్యక్తిగతంగా వుత్పత్తి జరిగేది వ్యక్తిగత వుపయోగమునకు వీలుగా వుత్పత్తి సాధనములుండేవి కాబట్టి పురాతనమైనవిగా, వికృతంగా, స్వల్పంగా, బలహీనంగావుండేవి. ఉత్పత్తి, వెంటనే వుత్పత్తిదారుని స్వంత వుపయోగమునకుగాని, లేదా ఆతని జమీందార్ ప్రభువు వినియోగమునకుగాని, అయివుండేది. ఈ వినియోగమునకు మించియే ఏమైనా మిగిలివుంటే, అది అమ్మకమునకు జూపెట్టబడి, మారకంలోనికివచ్చేది. కాబట్టి సరుకులఉత్పత్తి శైశవావస్థలో వుండేది; కాని అప్పటికే, దానిలో సామాజికోత్పత్తిలోవుండే అరాజకము బీజరూపంలో వుండేది.

II కాపిటలిస్టు ఉత్పత్తివిధానం:- పరిశ్రమ మొట్టమొదటగా, సామాన్య సహకారంద్వారాను, మాన్యుఫాక్చరర్ (పెద్దకర్మాగారాలలో ఉత్పత్తి చేతిపనులద్వారానే జరుగుట) ద్వారాను మారుతుంది. ఇంతవరకూ చెదురుగావుండే ఉత్పత్తి సాధనాలు కేంద్రీకరింపబడి పెద్ద కర్మాగారాలుగా తయారు కాగలవు. ఫలితంగా, అవి వ్యక్తిగత ఉత్పత్తిసాధనాలుగానే

సామాజికోత్పత్తి సాధనాలుగా మారుతవి; కాని ఈ మార్పు మొత్తంమీద మారకంపద్ధతిలో ఏమీమార్పును తెచ్చిపెట్టదు. కాపిటలిస్టు ప్రత్యక్షమౌతాడు. ఉత్పత్తిసాధనాల స్వంతదారుని(ఓనర్)రూపంలో అతడు దినుసులను భుక్తంగావించుకొని, వాటినిసరుకులుగా మారుస్తాడు. ఉత్పత్తి,సామాజికక్రియ అవుతుంది; మారకము, దానితో చాటుగా భుక్తముమాత్రము వ్యక్తిగతక్రియలుగానేఉంటవి; విడివిడివ్యక్తులచర్యలుగానేఉంటవి. సామాజికమగుదినుసువ్యక్తిగత కాపిటలిస్టుచే భుక్తంచేసుకోబడుతుంది. ఈనాటి సమాజం ఏ వైరుధ్యాలలో నడుస్తున్నదో, ఆధునిక పరిశ్రమ వేటిని బహిరంగపర్చినదో, ఆ వైరుధ్యాలన్నిటియొక్క జన్మకు కారణమగు మూలవైరుధ్యము ఇదే.

(అ) ఉత్పత్తిదారుడు ఉత్పత్తిసాధనములనుండి వేరుజేయబడినాడు. కార్మికుడు జీవితాంతము కూలిపని చేయునట్లుగా విధించబడినాడు. శ్రామికవర్గము, బూర్జువావర్గముల మధ్య వైరుధ్యము ఏర్పడింది.

(ఆ) సరుకుల ఉత్పత్తిని శాసించే సూత్రముల ప్రాముఖ్యత, పరియోజనము వృద్ధియగుట. కళ్ళెములేని పోటీపోరాటం. వ్యక్తిగత ఫాక్టరీలో జరిగే సామాజికోత్పత్తి నిర్మాణమునకూ, ఉత్పత్తి మొత్తంలో జరిగే సామాజిక అరాజకమునకూ మధ్య వైరుధ్యం.

(ఇ) ఒకవైపున, పోటీమూలకంగా, ప్రతి పారిశ్రామికాధిపతీ తన యంత్రపరికరములను తప్పనిసరిగా పరిపూర్ణమునొందింపపలసినదిగా నిర్బంధింపబడుట. ఇందుమూలకంగా అంతఎక్కుమంది కార్మికులను విధిగా పనినుండి తొలగించుట, పారిశ్రామిక నిల్వసైన్యం ఏర్పడుట (industrial reserve army). మరొకవైపున, వుత్పత్తిని హద్దులేకుండాపెంచుట: అదేవిధంగా, ప్రతిఒక్క పారిశ్రామికాధిపతీ తప్పనిసరిగా పోటీలోపాల్గొనుట. ఈ విధంగా, రెండువిధాలా, వుత్పత్తిశక్తుల అపూర్వాభివృద్ధి: డిమాండునుమించి సప్లైవుండుట; అమితోత్పత్తి: మార్కెట్లు సరుకులతో కుక్కబడుట; ప్రతిదశాబ్దంలోనూ ఆర్థికసంక్షోభాలు, విషమచక్రం: ఇక్కడనేమో ఉత్పత్తిసాధనములు, దినుసులు అమితంగా మిగిలివుండుట; అక్కడనేమో, పనిగాని, జీవనాధారములుగాని లేని కార్మికులు అమితంగా మిగిలివుండుట. అయినప్పటికీ వుత్పత్తికీ, సామాజిక క్షేమానికీ అవుసరమగు ఈ రెండులీవర్లూ కలిసి పనిజేయటం అసాధ్యమాతుంది; కారణమేమిటంటే, వుత్పత్తిశక్తులూ, దినుసులూ ముందుగా కాపిటల్‌గా మార్చబడుతేనేగాని కాపిటలిస్టువిధానం వుత్పత్తిశక్తులను పనిచేయనీదు, దినుసులను చలామణీ కానీయదు: అవి అమితంగా వుండటంవల్లనేమో కాపిటల్‌గా మార్చబడనూ మార్చబడనీయవు. వూర్తిగా వెగటు కల్గించునంతగా ఈ వైరుధ్యం పెరుగుతుంది. వుత్పత్తివిధానం మారకంరూపంపై తిరుగుబాటు జేస్తుంది. ఇకతాను,

తన సామాజిక వుత్పత్తిశక్తులనే నిర్వహించలేని అసమర్థతకు బూర్జువావర్గం దిగజారుతుంది.

(ఈ) ఉత్పత్తిశక్తుల సామాజిక స్వభావమును కాపిటలిస్టులే కొంతవరకూ గుర్తించినట్లుగా నిర్బంధింపబడుతారు. బ్రహ్మాండమగు వుత్పత్తి రవాణా సంస్థలు మొదటగా జాయింటు స్టాకు కంపెనీలవల్ల తర్వాత ట్రస్టులవల్ల పిమ్మట ప్రభుత్వంవల్ల భుక్తం చేసుకోబడుతవి. బూర్జువావర్గం అనవుసరమగు వర్గంగా రుజువు అవుతుంది; దాని సామాజిక కర్తవ్యముల నన్నిటినీ జీతంపుచ్చుకొనే వుద్యోగులే నిర్వహిస్తూఉంటారు.

III. శ్రామికవర్గవిప్లవం :— వైరుధ్యముల పరిష్కారం శ్రామికవర్గం రాజ్యాధికారమును వశపర్చుకొని, ఆబలంతో బూర్జువావర్గం చేతులనుండి జారిపోయే సామాజికోత్పత్తి సాధనములను పబ్లిక్ ఆస్తిగా మార్చుతుంది. ఈ చర్యద్వారా ఇంతవరకూ కాపిటల్ స్వభావాన్ని మోస్తూవున్న ఈ వుత్పత్తి సాధనములను ఆస్వభావంనుండి విముక్తినొందించి, వాటిసామాజిక స్వభావమును పూర్తిగా వ్యక్తంజేసుకొనే అవకాశమును కల్గిస్తుంది. ముందుగానే నిర్ణయింపబడిన ప్లాను ప్రకారం జరిగే సామాజికోత్పత్తి ఇప్పుడు సాధ్యమౌతుంది. ఉత్పత్తి అభివృద్ధి మూలకంగా, ఇంకా సమాజంలో భిన్నవర్గములుండటం అసందర్భమౌతుంది. ఎంతవరకు సామాజికోత్పత్తిలో అరాజకం అంతమౌతుందో అంతకు తగినట్లుగా, రాజ్యాంగయంత్రం యొక్క రాజకీయాధికారం అంతమౌతుంది. చిట్టచివరకు, తన

సామాజికవిధానముపై తాను యజమాని కావటంద్వారా, మానవుడు ఒకేసారి ప్రకృతికి శాసకుడుగా, తనకు తానే యజమానిగా — స్వతంత్రముగా - అవుతాడు.

ఈ ప్రపంచవిముక్తి చర్యను నిర్వహించే చారిత్రక కర్తవ్యమే ఆధునిక శ్రామికవర్గంపైవున్నది. చారిత్రిక పరిస్థితులను నిరూపించుట, వీటితోబాటు ప్రపంచవిముక్తి చర్యను స్పష్టీకరించుట, ఆవిధంగా ఈనాడు అణచబడివుండే వర్గం చైతన్యమునుపొంది, తాను చారిత్రికంగా నిర్వహించవలసిన ఈ చర్యయొక్క పరిస్థితులను, స్వభావమును తెలుసుకొనునట్లు జేయుట, ఇదే శ్రామికోద్యమముయొక్క సిద్ధాంతరూపమగు శాస్త్రీయసోషలిజంయొక్క కర్తవ్యం.

సమాప్తం





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA130B108 |
| పుస్తకం పేరు | సోషలిజం |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 107 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసేవది | kasimbi |
| పేజీలు విడదీసేవది | kasimbi |
| స్కాన్ చేసేవది | [illegible] |
| పరీక్ష చేసేవది | RAMYA |
| పేజీలు సరిచూసేవది | |
| బైండింగు చేసేవది | |
| ప్యాకింగు చేసేవది | |
| పరిస్థితి | Good |